# అహం

'నాఽనృషిఃకురుతే కావ్యమ్'. ఋషికానివాడు వ్రాసినది కావ్యంకాదు. అనగా ఋషిమాత్రమే కవిగా నెన్నదగినాడన్నమాట! కవులుగా పరిగణింపబడు అనేకానేకులైన పెద్దలు గద్యపద్యాత్మక గ్రంథరచయితలేగాని అసలైన సిసలైన కవులు కారు. వాల్మీకి వ్యాసాదులను మాత్రమే కవులనదగును.

వేద మపౌరుషేయము. అనగా ఫలానావారిచే రచింపబడినదనటానికి వీలు కానిది. విశ్వమంతటితోను తాదాత్మ్యం పొందినవారి అనుభూతిని వాగ్రూపమున తెలుప నలవికాకున్నను తెలుపుడు చేయుటకు చేయబడిన సాహితీ తపమును వేదమనవచ్చును. అందుకనే 'అనంతావై వేదాః'. ఎవరి యనుభూతి వారిది. అనుభవమును వ్యక్తీకరించు తీరులనంతములు. కావనే అనేకానేక వేదములు కాలగర్భమున కలసిపోవుచు కొన్ని మాత్రమే మిగిలియుండుట సహజము, సమంజసమును.

దివ్యానుభూతినందిన రససిద్ధులైన కవీశ్వరులకు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనిపించినది 'తత్వమసి' అనే నిశ్చయం కలిగింది. 'అహం బ్రహ్మాస్మి' అనే అనుభవసిద్ధి లభించినది. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' అనే నిశ్చయాత్మకబుద్ధి నెల కొన్నది. తమ దివ్యానుభూతికి—ఆత్మరమణమునకు వారు అక్షరరూపమిచ్చినారు. అది రామాయణ మహాకావ్యము. అది కావ్యము.

వ్రాసినవారికే కావ్యము వ్రాసినదెవరను ప్రశ్న ఉదయించినది. తానే వ్రాశాననుకుందామంటే తాను కర్తననుకోటం అహంకార విమూఢతగా తోచింది. 'అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే,' అందుకనే దీనిని వ్రాసినదెవరో కాని వాల్మీకి వ్రాశాడనినారు ఎవరూ వ్రాసినది కాదేమో వేదంలాగానే! వ్రాసినవాడు వాల్మీకిమహర్షి అనుకుంది లోకం. నిజమే, రామాయణకర్త వాల్మీకియైన మహర్షియే కదా!

ఆత్మారాముడైన పురుషోత్తముని గాథను, అనగా జీవనమార్గాన్ని — రాముని అయనంగా తెలిసికొని, ఆ మార్గమున తాను పయనించి—'అధీతి బోధాచరణ ప్రచారములు' ఆదర్శతగా కలిగిన మహోన్నత మానవుడు వేదార్థ ఉపబృంహణం

కోసం రామాయణ కావ్యాన్ని రూపొందించి కర్తపేరునుకూడ ఒక కావ్యంగా నిర్ణయించాడు 'వాల్మీకి.' అదే ధ్వన్యాత్మకమైన నామం నిజంగా !

రసాత్మకమైన వాక్యం అనగా కావ్యమే! వాల్మీకిచుట్టూ పుట్టపెరిగింది. పుట్టలోనే పుట్టినాడా అనే మిథ్యాజ్ఞానం కలిగేటంతగా పెరిగింది. అయితే యీ పుట్ట మనం అడుగడుగునాచూచే చెదలపుట్టయేనా! దేహిచుట్టూ యేర్పడే దేహావరణకాక యీ వల్మీకానికి సమంజసమైన సరసమైన అర్థం ఏముంటుంది ? దేహమే తానను భ్రాంతి ప్రతిజీవికీ కలుగుతూనే వుందికదా !

అతడు తపోనిష్ఠలో ఉండగా చుట్టూ పుట్టపెరిగింది. ప్రతిజీవికీ జీవనమనేది తపస్సు కాదా! కొందరి తపస్సు ఫలించి దేహమే నేనను భావం నశించి—అంటే మనోనాశం కలిగి ముక్తులౌతారు. కొందరాపుట్టలోనే 'పుట్టలోన చెదలు పుట్టదా గిట్టదా' అన్నట్లు జననమరణాది సంసారచక్రంతోపాటు పరిభ్రమిస్తూ వుంటారు.

పుట్టనుండి ఎడిగిన ఒక రససిద్ధుడైన మహర్షి రామాయణకర్త. అవును అతడు వాల్మీకియే! 'వాక్యం రసాత్మకం కావ్యం' అన్నారుగదా! ఇందులో వాక్యం, రసాత్మకం, కావ్యం అనే ముచ్చటైన మూడుమాటలూ సార్థకమయినవని గుర్తింపదగును. 'వాక్యం' అంటే వేదము. 'రసోవైసః' కాబట్టి బ్రహ్మనుగూర్చి తెలుపునది మాత్రమే రసాత్మకం. 'కవేర్భావం కావ్యమ్' అనుట సరసమైన సార్థకమైన అవగాహనమగునేమో! యోచింపదగినదే.

ఛందమనగా వేదము. 'చరణం' అన్నా వేదమే. వేదవేత్తలు చారణులు. ఆంజనేయుడు సీతను వెతుక్కుంటూ ఆ'చారణచరితేపథి' వెళ్ళాడట, వేదవిదులైనవారి ఆచరణపథంలో పురోగమించాడని అర్థంచేసుకుంటే బాగుంటుంది.

కవిత ఛందోబద్ధంగా ఉండాలి. అంటే గణయతిప్రాసలతోకూడిన ఆలంకారికమైన రచన కావ్యంగా పరిగణింపబడునన్నమాట. అయితే ఛందోబద్ధం అనే మాటకు సర్వసార్థకమైన అన్వయం పరబ్రహ్మ ప్రతిపాదకమై ఉండవలెననుట సమంజసము. ఛందస్సుతో కూడినదగుట సామాన్యార్థం. వేదార్థ ఉపబృంహణం అగుట విశేషార్థం. ఆ అన్వయానుభూతికి అద్దంపట్టే రచనమాత్రమే సరసమైన అసలుకావ్యం.

అనుభూతి ఆచరణ అవినాభావములు. భావమాత్రమైన అనుభవం ఆదర్శం. ఆదర్శం ఆచరణరూపం ధరించటం 'ధర్మం' అనబడుతుంది. ఆచరణదూర మైన భావైకమాత్రస్థితి సర్వస్వం ధర్మంకాదు. 'స్థితప్రజ్ఞస్యకాభాషా...కిమాసీత వ్రజేతకిమ్' అనే గీతాకారుని ప్రశ్నయు సమాధానమును గమనింపదగినవి స్థితప్రజ్ఞు డనినా మహర్షి యన్నా ఒకటేగదా. అతడేంచేస్తాడు–ఎక్కడ వుంటాడు–ఎక్కడికి పోతాడు–అనే ప్రశ్నలు బహుళార్థ సాధకములు.

సమాధానంగా చెప్పబడిన వానిలో 'దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః, వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే' అనేది ప్రముఖమైనది. యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ' అనే శ్లోకమూ; 'ఈశావాస్యోపనిషత్తు లోని తేన త్యక్తేన భుంజీథాః' అనే మహావాక్యమూ ప్రధానాంశములు. రామాయణ కావ్యమునకు ప్రస్తుతాంశములు.

స్థితప్రజ్ఞుని ఆచరితమే రామచరితం. దానికే 'సీతాయాశ్చరితం' 'దశకంఠ వధం' అనే సార్థక నామములున్నై. కొన్ని సల్లక్షణములు పేర్కొని ఆ లక్ష ణములకు లక్ష్యభూతుడైన మానవుడు 'అస్మిన్ సాంప్రతంలోకే' ఉన్నాడా యని వాల్మీకిమహర్షి నారదమునిని ప్రశ్నించాడు. 'అస్మిన్ సాంప్రతంలోకే'అంటే ఆనాడు త్రేతాయుగంలో అని అర్థం చెప్పుకుంటాం. అది యుక్తమేకాని, ఆ సల్లక్షణములు కలిగినవాడేనాడు ఎక్కడవున్నా రామభద్రుడే !

అట్టి సార్వకాలికమైన సార్వదేశికమైన సగుణమైన ఉత్కృష్టమానవుడే పురుషోత్తముడు. అట్టివాడే వాల్మీకి కృతమైన శ్రీమద్రామాయణ కావ్యనాయకుడు; శ్రీరాముడయోధ్యలో దశరథుని పుత్రుడుగా జన్మించెనట. ఏనాడో ఎచటనో ఏయదృష్ట వంతుని కడుపుననో జన్మించిన ఎంతటి మహానుభావుడును ఏనాడైనను ఎచటనైనను ఎవరినైనను తరింపజేయజాలిన రామభద్రుడెట్లగును ? ఆ లక్షణములు కలిగినవ్యక్తి పురుషోత్తముడు. అవతరించిన దైవము.

సర్వత్ర వ్యాపించియుండు దైవం కొన్నికొన్ని తావులందు ప్రస్ఫుటంగా కానిపించటం అవతారములలోని విశేషము. భగవద్గీతలోని విభూతియోగం ప్రతిష్ఠా పించినదీ యిదే. 'మాసానాం మార్గశీర్షోహం' యిత్యాది వాక్యములవలన భగవంతుడు

ఏకదేశంగా ఏకకాలంగా ఉండుననే స్ఫురణ కలుగుతుంది. కాని అట్లు అర్థంచేసుకొనుట సమంజసంకాదు. మార్గశీర్షమునందు మరింత విస్పష్టంగా దృశ్యమానమగుననే తప్ప మిగిలిన మాసములయందు భగవద్విభూతిలేదని అర్థము చేసికొనుట యుక్తము కాదు.

నిర్వికారుడైన దైవం మానవరూపమున అవతరించును. మానవరూపమున ననగా ఏ శ్రీరాముడుగనో, ఏ శ్రీకృష్ణుడుగనో అవతరించుననుకోటం సమగ్రంగా అర్థంచేసికొన్నట్లు కాదు. కనబడే సకల చరాచరరూపమైన జగమంతయూ భగవంతుని అవతారమే. అనగా అమేయమూ అనంతమూనైన సచ్చిదానంద శక్తి నుండి అవతరించినదే; శక్తినుండి యవతరించుటయును కాదు. ఆశక్తి యీవిధముగా పరిణమించుట అనదగును. అవతరించుట పరిణమించుటలలోని సూక్ష్మభేదము గమనింపదగును.

ఈ ప్రకారంగా మానవులందరూ అవతరించినవారేకదా; అవును, మానవులే కాదు, దైవంకానిది జగత్తునందున్నది కనుకనా; ఇట్లవతరించిన విశ్వమున ఉత్కృష్టమయిన, విశిష్టమయిన విభూతి ప్రస్ఫుటమైన తావున ఆ వ్యక్తిని అవతారమందుము. అవ్యక్తి సామాన్యంగా అనుకునేలాటి వ్యక్తికాదు. నిరాకార నిర్గుణమైన పరబ్రహ్మము సాకారంగా సగుణంగా వ్యక్తమైన సలక్షణమైన అవతారము.

నిరాకారమూ నిర్గుణమూ నైనది సాకారమూ సగుణమూ అగుటే సృష్టి. దీనిని భగవల్లీల అన్నారు. లీల అని ఎందుకనవలెనంటే, ఈ అవతరణకు—ఈసృష్టికి—ఈ నిమీలనోన్మీలనములకు కార్యకారణ హేతుబద్ధమైన సమాధానం లేదుగనుకనే, ఈ సృష్టి ఎందుకు అని ప్రయోజనమును మాత్రమెరిగిన మనస్సు — మానవుడు ప్రశ్నించుకోటం జరుగుతుంది. తన్నుదాను వేరుగా భావించువాడు ఎదుట చూచుదానిని—అనగా దృశ్యమాన జగత్తును, ఎందుకు ఎవరు సృష్టించారని ఆలోచించటం జరుగుతుంది. ద్రష్ట, దృశ్యమూ వేరుకాదు. అయినను మిథ్యాజ్ఞానంవలన భిన్నత్వం కనిపిస్తోంది. ఈసృష్టి యెందుకంటే సూక్ష్మంగా యోచిస్తే నేనెందుకు అనే ప్రశ్నయే; ఆ ప్రశ్నకు సమాధానం ఆ ప్రశ్నలోనే యిమిడియున్నది. నేను వేరను మిథ్యాభావం పోగొట్టుకునేందుకు; అనేదే సమాధానం.

తాను తానగుటకే, అద్వయానందప్రాప్తికే. ఆ యనుభవమున ప్రశ్నలేదు. ప్రశ్న ఉన్నంతవరకు అనుభవలేశమేకాని సమగ్రమైన అనుభూతిలేదు. ఇదే అన్నా

హ్యమైన సృష్టి చమత్కారం. కార్యకారణాతీతమైన దానిని, కార్యకారణ సర్వస్వమైన మనస్సుతో విచారించటం నిష్ప్రయోజనం. పిల్లవాడెందుకు ఆడుకుంటున్నాడు ? ఆనందంగా వుంటుంది కాబట్టి. అలాగే భగవంతుడూ ఆడుకుంటున్నాడని సమాధాన పడటం చిత్తశాంతినిచ్చే నిజమైన అబద్ధం; ఆడుకుంటున్నాడనటంలో కర్తృత్వం ఉన్నది.

భగవంతుడు నిష్క్రియుడు కాబట్టి ఆడుకోటంలేదు. ఆడుకొనేవాడూ ఆట ఒకటే కాబట్టి 'లీల' అనే నిర్వచనం భక్తహృదయానికే సమాధానం. సాకారంగానూ, సగుణంగానూ అవతరించిన ఉత్కృష్టజీవి అవతారం—పురుషోత్తముడు, స్త్రీపుం నపుం సాత్మక లింగభేదము లేనిదానిని లింగవిభక్తి విచక్షణ కలిగినవాక్కు సమగ్రంగా చెప్ప జాలదు. కాబట్టి దైవం వాగతీతం.

వాగతీతమైనదానిని తెలుసుకోటానికి వాక్కనేది ఒకే యొక శరణ్యం. ఇదే బ్రతుకులోని చమత్కారం; ఈ అనిర్వాచ్యమైన, అమేయమైన, అనంతమైన నిత్య సత్యాన్ని వాగ్రూపంగా అనుమేయమైన ధ్వని సంపన్నతతో సాంతముగా తెలియ జేయటం కావ్యం సాధించిన మహాకార్యం. అనగా ఈ గాథను ఒక కథగా రూపొం దించటం కథను కథగానే కాక సమగ్రమైన సత్యాన్ని అందజేయునదిగా లక్ష్యలక్షణ సంపన్నమైనదిగా అందజేయటం మహర్షి అనుగ్రహించిన వరం; దేశకాల నిబద్ధమైన కథద్వారా సార్వదేశిక సార్వకాలిక సత్యమును దర్శింపజేయటం — ఆత్మదర్శనమును జగత్తునకు దృశ్యమానముచేయుట - కావ్యప్రయోజనం.

'రామోవిగ్రహవాన్‌ధర్మః' ధర్మమనేది యిదమిత్థమని నిర్ణయింపదగిన నిర్వచనమునకందు విషయంకాదు, ప్రవహించే నది ఎచటనైనా ఏనాడైనా నీరే అగు నట్లు, ధర్మవిగ్రహుని ఆచరణ ఆయా దేశకాల సందర్భశుద్ధమై ధర్మం అవుతుంది. దైవం నిర్వచనకందనట్లే ధర్మమూ అందదు. శ్రీరాముడు ధర్మము నాచరించెననుట కంటె అతని ఆచరణయే ధర్మమయ్యెననుట సమంజసము. ఆచరింపబడుటయే ధర్మ మనుదానికి సమగ్రరూపం.

ధర్మమునుగూర్చి వినుట వినుపించుట మాత్రమే ధర్మలేశము. 'బ్రహ్మ విద్ బ్రహ్మైవ భవతి' అన్నట్లుగా రామాయణము తెలియుటే తాను రాముడగుటతో

సంపన్నమౌతుంది. ఏ ధర్మాత్ముడు ఆత్మయందెంత రమించినా అంత రాముడవుతూ వుంటాడు. రామాయణం తలక్రిందుగా చదివి - వ్యాఖ్యానించి - ఉపన్యసించి - రచించి, ఆచరణశూన్యులై అతిసామాన్యులుగా మిగిలిపోయినవాహూ వున్నారు. సహృదయుని దృష్టిలో ప్రథమశ్రేణికి చెందిన మహనీయులు - మహర్షులు, కవులు రెండవ కోవకు చెందినవారు. కవి శబ్దవాచ్యులయ్యీ - కవులుగా భావింపబడుచున్నారు.

ఈ రామాయణ సౌరభం వ్రాసనవాడు రెండవకోవకు చెందిన పద్య నిర్మాత. అందుకనే కార్యకర్తృత్వం భారం అనిపించి, ఆదికవి హృదయాన్ని గ్రహించటానికి హృదయపూర్వకమైన ప్రయత్నం జరిగింది. కాబట్టి సహృదయునిది కర్తృత్వం !

సీతా! కామేశ్వరి! భూ
జాతావన కనకదుర్గ! సాహిత్య మహీ
జాత శకుంతా! హనుమా!
చైతన్యావధి! అయోనిజా సత్యవతీ!



# రసాప్త వాక్యం

మానవుడు తిర్యగ్ జంతుజాలములో సర్వవిధముల ఉత్తమజీవిగా రూపొందియున్నాడు. ప్రకృతిలోని యితర జీవకోటితోపాటుగా మనుగడ సాగించుచు తద్భిన్నమైన మనోవ్యాపారమున నిమగ్నుఁడై నిరంతర పరిణామములకు తన్నుతాను గురిచేసుకొనుచు తోడి ప్రాకృతిక ప్రాణికోటికంటె విలక్షణుఁడై క్రమోన్మీలనమైన వివేచనతో అభివృద్ధిఁజెందుట మానవుని ప్రత్యేకత. కేవల ధ్వనులతో, నిత్యజీవితయాత్రను జరుపుకొను తిర్యగ్యోనులకంటె భిన్నముగా స్వరములు కంఠమునకొదిగి శబ్దములుగా నీతనికి లబ్ధమగుటయే జ్ఞానవిజ్ఞాన సౌధాధిరోహణమునకు ప్రథమ సోపానముగా నుపకరించెను.

పాశ్చాత్య మీమాంసకులు ప్రకృతికి వ్యవచ్ఛిన్నమైన వ్యక్తిగా మనోవిశ్లేషణ శాస్త్రములో మానవునిగూర్చి నిర్వచించుట కిటీవల పూనుకొనుచున్నారు. మానవుఁడు తదితర ప్రాణికోటివలె ప్రాకృతిక దేహధర్మమున జీవించుచు, మరణించుచు నుండిపోయినచో ప్రకృతి పరిధిలోనే జీవులన్నిటివలె నుండియుండెడివాఁడు. ఆహార నిద్రాభయ మైథునములకు అతీతమైన జిజ్ఞాస అతనికి సృష్టి మర్మగవేషణకై ప్రత్యుత్సాహమిచ్చినది. ఆర్షవిజ్ఞానము సైతము ప్రకృతికి విభిన్నుఁడైన పురుషమూలకముగా మానవుని పేర్కొని యుండెను.

జంతుకంఠములలోని ధ్వనులు శబ్దసంకేతములుగా మారుట అవ్యక్తజ్ఞానమునకు అభివ్యక్తి లభించుటగా మనము గ్రహించదగినది. శబ్దములు ఈషదాలోచనచే క్రమపరిణామమున వివేచనలుగను, మననమున జ్ఞాన ప్రరోచనలుగను ఉపలభ్యములై స్మృతికి దారితీసినవి. శబ్దము క్రియకు సంకేతమై జాగ్రతగ వినుటచే లభ్యమై శ్రుతికి దోహదము చేసినది. శ్రుతి స్మృతిపూర్వకమైన జ్ఞానము వేదమై (తెలిసికొనబడుచు) పురుషాంతరములుగ నందించబడుచు వచ్చి మహార్షవిజ్ఞాన కల్పవృక్షముగ నేఁటికి ప్రత్యక్షమైనది.

శబ్దము రూపొందిన మానవకంఠమున సూక్ష్మతర శబ్దధ్వని, స్వరములను, వర్ణసమామ్నాయమును సర్వవిన్యాసములను కల్పించినది. తాను శ్రమించి నేర్చిన

అనుభవమును శబ్దసంకలితముగా తనవారికందించుచు తాను 'మనువై' మొదలు తుదీ లేని మానవుఁడు ప్రకాశించుచున్నాడు. మనస్సు మనన క్రియాపరిణామమని ప్రాక్ప్రశ్చిమ విపశ్చిన్మతము. ఇది నిర్వివాదాంశము. ఈ మనస్సు సంకల్ప వికల్పాత్మకమై యున్నది. దీని వృద్ధిపరిణామము స్మృతి పూర్వకమై స్మృతి బుద్ధిగా నిర్వచింపఁబడినది. బుద్ధియెదిగి చిత్తముగా స్థిరపడినది. ఈ మనోభాగము సోపానత్రయము నధిగమించిన తానహం కారుఁడై మానవుడు మనువును కొనసాగించుచున్నాడు। ఈ నాల్గింటి సమాహారము అంతఃకరణ తతుష్టయముగ నిర్దేశింపఁబడినది.

మనస్సు మననశీలియై ద్విపాత్తుగ జీవించెడి ప్రాణికి మానవుఁడను నామము నిచ్చినది. దీనినర్థము చేసికొనుటకే ప్రాగపరదిగ్విద్వాంసులు వేదకాలమునుండి నేటి వఱకు పరిశోధనలుచేసి వారివారి సిద్ధాంతములను గ్రంథ సహస్రములుగా ప్రకటించుచు వచ్చుచున్నారు. నిజమునకు మనస్సొక పడుగుపేకల యల్లికల వస్త్రఖండము వంటిది. నిలువు నడ్డపుటల్లికల తంతువులే సంకల్ప వికల్పములు। వానిని తొలగించినచో వస్త్రఖండమే లేదు. అట్లుగా నేతయై (అమరికయై) యుండుట దానిస్వభావము।

దశేంద్రియ వ్యాపారములకు అధిష్ఠాతయైన యీ మనస్సు ఇంద్రియ వ్యాపారకారకములగు విషయములు తటస్థించినంతనే తంతువాయి తన యుదరస్థితమైన తంతుజాలముతో పటము నల్లుటకుపక్రమించునట్లుగా మనస్సు సంకల్ప వికల్పరూప తంతువులను సృష్టించుచు సంసృతిపటమును వినిర్మించుచు పోవును. తంతుజాలము ఈ నేత ఉద్ధృతమైనప్పుడు మనస్సు ఉద్రిక్తమై కలవరపాటు నొందును. విషయాంతర మెరుఁగని నేత 'ఉన్మాదము।' నిర్విషయమై యుండుట సమాధి ।

ఈ మనోభూమిక మానవజీవితమున నతిముఖ్యపాత్రను వహించి యున్నది. మనస్సు జ్ఞానేంద్రియ పంచకము ద్వారమున బాహ్యజగత్తులోనికి భావముల వర్షించుచు పర్జన్యునివలెను, బాహ్యజగత్తునుండి విషయజ్ఞానమును సేకరించుచు భాస్కరునివలెను వ్యవహరించుచున్నది. అనగా బహిర్జగత్తుతో మనస్సున కెడతెగని సంబంధములుండుట కలదు. నిరంతర గతిశీలమైన మనస్సు రాజువలె ఇంద్రియములపై పెత్తనము వహించును. కొండెముల వినెడి యేలికవలె ఇంద్రియ వశమైన మనస్సు అదుపు తప్పును.

మనస్సును లోబరచుకొనుటకే హఠయోగములు, మంత్రప్రయోగములు నేర్పడినవి. మనోలయము మోక్షమనియు, మనోగమనము నూర్ధ్వముఖ మొనర్చుట కైవల్యమనియు ఉత్తరమీమాంసకు లుపన్యసింతురు. ఈ మనస్సున కింద్రియ వ్యాపారములను పుష్కలముగ నందించి పరితుష్టిని బెంపించుటవలన నుపశమింపఁ జేయవలెనని ఐహిక సుఖప్రాపకులైనవారు చెప్పుచున్నారు :

అందులకు మనస్సును ప్రశాంత స్థితియందుంచుటయే లక్ష్యము మనస్సును మర్కటమనవచ్చును – అది విషయశాఖా చంక్రమణశీలి, త్రాగించిన కట్టువడక వట్టి విడక మరీ కోతిపనులు చేయును: మనస్సునకొక గుణమున్నది. అది జగద్విషయములను గ్రహించి అట్లుగానే అంతఃసృష్టి (సంకల్ప వికల్పాత్మక) భావ విభావాను భావములనుచేయు నేర్పు కలిగియున్నది. వేదాంత వితండ పండితులుకాని, హఠయోగులుకాని ఈ నేర్పును గుర్తించలేదు. ఈ నేర్పనే ఆలంబముగఁజేసికొని మనస్సు నేకోన్ముఖమైన భావనామయ సృష్టికి ఉత్తేజింపఁజేసినచో నా సమ్యగ్రచనలో నిమగ్నమైనమనస్సు తల్లీనమై తన్మయమై ఉన్మన్యవస్థను జెందును. ఇది, రససిద్ధాంతమునకు స్థూలమైన ప్రాతిపదిక :

ఉత్తరోత్తరం బలీయః'గా వాదవివాదములతో తర్కమీమాంసలతో ఈ 'రసచర్చ' శతాధిక శకటాధిక గ్రంథభారమై పోయినది: రసచర్చను కొనసాగించిన వారాలంకారికులు: వారు కళలను నిర్వచించిరి. విద్యలకును కళలకును గల భేదమును వివరించిరి. వీరిలో నెక్కువమంది కళాస్రష్టలు కారు: అందువలన స్రష్టకు, సామాజికునకు లభించవలసినంత న్యాయము లభించలేదు. ఇదిగాక నాలంకారికులు, కావ్య మీమాంసను, తర్కశాస్త్ర పాండిత్యముతో, పూర్వపక్ష సిద్ధాంతములను చేసిరి. ఖండన మండనాదులఁ గావించిరి. వీరు చేసినవన్నియు నేలవిడిచిన సాములే యైనవి: మనో నిష్ఠమైన అనుభూతిని వదలి వీరు చేసినవన్నియు తద్భిన్నములైన తర్కవ్యాకరణ ప్రకరణములై అలంకార గ్రంథములలోనికి చొరబడుటచే కవికి న్యాయము కరువై పోయినది.

లలితకళలు మనోరంజకతకు మాత్రమేగాక సామాజికునకు ఆత్మోపలబ్ధి కూర్చవలెనని ప్రాక్పశ్చిమ కావ్యమీమాంసకులనిరి. కావ్యకవితను చతుష్షష్టి కళలలో చేర్చక, పద్యరచన, చాటూక్తులు, సమస్యాపూరణము, ఆశువులను మాత్రమే చేర్చిరి

పురాణ కావ్యకవిత్వమును లలితకళలకంటె భిన్నమైన విద్యగా యోగసాధనగా ప్రపంచించిరి. 'అగ్నిఋషిః, కవిఋషిః,' 'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః' అని నుడివిరి. 'నానృషిః కురుతేకావ్యమ్' అని వచించిరి. కవిని క్రాంతదర్శి యని శ్లాఘించిరి. అట్టి కవిని 'నిరంకుశాః కవయః' 'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యస్సమాభ్యః' అను నిర్వచనముల సంభావించుచో నాతని భావనాత్మక వృత్తిని కావ్యమని చెప్పవచ్చును !

లలితకళలందు శిల్పము చేయువాఁడు శిల్పియైనట్లు కావ్యము వ్రాయువాఁడు కవి కానేరడు. కవి, కావ్యములలో కవి మొదటిశబ్దము. అతనిచే నిష్పన్నమైన మనోవృత్తి కావ్యము! ఇటులనే నటి – నాట్యములలోను గలదు. తన్మయురాలైన స్త్రీమూర్తి తత్తత్సన్నివేశములలో చేయు అంగవిన్యాసములైన చేష్టలు మూకాభినయములై నాట్యముగ రూపొందినవి! కావ్య నాట్యవిద్యలను సమగ్రముగా తెలిసికొనినచో సర్వ లలిత కళలను గూర్చిన జ్ఞానమును మనము పరిగ్రహించినట్లేయగును! నటి – స్త్రీపరమైనది. కవి – పురుషపరమైనది. బహిఃప్రపంచ గుణావగుణ సన్నివేశ సన్నికృష్టములైన ఈ స్త్రీపురుష ప్రకృతులలో కల్గిన భావస్పందన నటియందాంగికముగాను, కవియందు వాచికముగాను ప్రదర్శితము లగుచున్నవి !

ఈ రెండును రసస్వరూపమునకు ప్రథమదశలే. అనగా నటి – కవి అను శబ్దములను సమ్యగర్థములతో సంగ్రహించుకొనినచో మనము రసస్థితి నవగాహనమొనర్చుకొనగలము. ఇచ్చట 'సహృదయత' అను మరియొక శబ్దము నుపకరణముగ వాడుకొనినగాని సర్వ లలితకళల ధర్మములను ప్రతిబింబించఁదగిన దర్పణము మనకు లభించదు. మనస్సు నిరంతర చలనశీలి! సంకల్ప వికల్పస్థానము. దానిలోని నిశ్చా స్ఫూర్తిపూర్వకమైన మననశీలి భాగమునకు 'సహృదయ'మని నామమిడినచో దాని నధిష్ఠానముగచేసి రసచర్చ నొనర్ప వీలుకలుగును.

స్ఫూర్తిపూర్వకమైన 'సహృదయత' ఒక మానవునిలో హఠాత్సంప్రాప్తమగునట్టిదికాదు. సద్గుణములచే, స్వచ్ఛప్రవర్తనచే, సదాచారసంపత్తిచే సంస్కారరూపమైన ఈ యమూల్యమైన మనోవిభాగము – ఒకానొకనికి పూర్వపుణ్య విశేషలబ్ధమైయుండును. సమాజములోని యన్యాయములకు, క్రమరాహిత్యమునకు అది కంపిల్లిపోవును. అన్యాయము చేయఁబడిన జీవియొక్క అనుభూతినే (స + అనుభూతి)

తానును పొందును.అనుతాపము బలీయమై తద్దౌష్ణ్యముచే మనోధర్మము(హృదయము) కరిగి కవికి వాక్కున, నటికి ముఖమున తత్కృత్య సంవేదనయై, సంవాదనయై ప్రవహించును. దానినే మనము రసమని ఆలంకారిక పరిభాషలో నందుము.

బోయవాఁడు క్రౌంచమును చంపుట సామాన్య ధర్మమే. బోయవాని ఆలుబిడ్డల కాహారమైనది పక్షికదా! చంపుటలో నాతని తప్పులేదు.కాని అచ్చటికొక సహృదయుఁడువచ్చుట తటస్థించినది. ఆసహృదయునకుఅచ్చట'మిధున క్రియా ప్రియము'లైన క్రౌంచద్వితయము కన్పించినది. వాని ప్రీతికరమైన ధ్వని చేష్టితముల కాతని హృదయము కంపించినది.తల్లీనుడైన ఆరసహృదయునకా స్థితిలో తాను మానవుఁడననియు, అవి శకుంతములనియు భేదము మిగులలేదు. రెండును ప్రాణిధర్మములైన ప్రేమానురాగములను ప్రదర్శించుకొనుచున్నవి. మూడవ శకుంతమై (కవి సహృదయము) తానును ఆ కొమ్మలపైననే రెండిటిలోను తిరుగాడుచు, తల్లీనమై తన్మయమైయున్నది. అనగా అన్యోన్య ప్రేమయే ఆలంబనశాఖకాగా దానిపైసుఖముగానున్నసహృదయతకు హఠాత్తుగా దూసికొనివచ్చిన బాణము గ్రుచ్చుకొనినది. ఆ బాణపాతము క్రౌంచముపైననా, సహృదయముపైననా? ఆహృదయము విలవిలలాడి యుగ్రప్రతిక్రియగా క్రింద పడిపోయినది. బాధాశోణితము స్రవించినది. హృదయము సానుభూతిని పొందినది.

ఇప్పుడు చూడగా, ఆనందలక్షణ విధ్వంసకుఁడైన కిరాతుఁడు కన్పించెను. బ్రదికియున్న క్రౌంచ హృదయమువలె శోకవాక్కులను, అశక్తతను తానుకూడపల్కినది. బ్రదికియున్న క్రౌంచముయొక్క దీనస్వరమే మానవభాషలో సంవదించిన ఆ రసహృదయమునే మనము "కవి" యని నిర్వచించవలెను. జీవక్రౌంచ స్వరము (మధ్యమస్వరమై)సంగీతస్వరమై యున్నది ఆ శకుంతస్వరము శ్రుతిలయ సమన్వితము కదా! దాని వేదనామయనాదమునే ప్రతిధ్వనించు ఆ సహృదయుని వాక్శ్లోకమే శుతిప్రీతిఁగూర్చెడు శ్లోకమై విన్పించెను.

ఈ యుదాహరణముతో కవిని సహృదయాత్పరమునిగా మనము గ్రహించుటలో విప్రతిపత్తి యుండనక్కరలేదు. 'నానృషిః కురుతే కావ్యమ్' అని మనము నిర్ధారించినచో నటికిసమకూర్చిన సామగ్రి-ఆహార్యములు ఇక్కడకవికక్కరలేదు. అష్టరసస్థాయిని, సాత్త్వికాభినయమున ప్రదర్శించు నటునికంటె భిన్నుడైన కవి-తానుగ ననుభవించి, ఆ యనుభూతి విశేషమును స్మృతిలోనుండితీసి వాక్కున ప్రదర్శించును

మొదటిదానియందు రసానుభూతి సద్యఃపాత్రప్రాప్తమును, రెండవదానిలో స్మృతివృత్తాను ప్రాప్తము: మొదటిదానికి లోచనమే చాలును. రెండవదాని కాలోచనము కావలెను.

ఇప్పుడు సహృదయత ద్రవీభూతమై రసమగును. సహృదయులైన సామాజికులందఱు కవులగుదురా: సహృదయునకు వస్తుగత గుణాగుణ వివేచనగాని, సన్నివేశగత రస విచక్షణగాని యుండదు. కవి సన్నివేశమును నిర్దేశించి చూపించగా, సహృదయ మచ్చటికి పరుగులెత్తి రసావగాహన మొనర్చి వచ్చును. మనోబుద్ధి చిత్తాహంకార భాగములుగానున్న అంతఃకరణ చతుష్టయమునకు, నాల్గావరణము లమర్పబడి యున్నవి.

అన్నమయకోశము రాజ్యముగా, మనస్సు రాజై పాలన సాగించును. ప్రాణమయ కోశమును బుద్ధియు, విజ్ఞానమయ కోశమును చిత్తమును, ఆనందమయ కోశము నహంకారమును పాలించుచున్నవి. భౌమమైన అన్నమయ కోశముచుట్టును మనస్సు సంచరించుచుండును. ఇచ్చటి సహృదయత తద్రసావస్థకు పరమైయుండును.

కవి లలితకళలకు స్రష్టయై, ద్రష్టయై, పరితుష్టిని పొందును: కావ్యానందము, బ్రహ్మానందలవీ భూతమని, నిర్వికల్పానంద సబ్రహ్మచారియని, రస నిర్ణేతలు నిర్వచించిరి: ఇది యెంతటిదైనను జగదితివృత్త పర్వములను ఖండించి పిండిన చెఱకు రసము మాత్రమే: చర్వ్యమాణ (మననక్రియామాణ)మైన రసమును పొందుటకెంతయో పిప్పి నమలవలసి వచ్చును. మనోహ్లాదముతోపాటు తల్లీనతకును, కావ్యముపకరించును. పూర్తిగా బ్రహ్మానందము కానేరదు: కాని బ్రహ్మానందమును రుచిచూపించుటకిది ఉపమాన మాత్రోపయోగి కాగలదు. 'కవిత్వము' కవిభావనావృత్తముగను, బహిఃప్రపంచమునుగూర్చి కవిచేసెడి రస వ్యాఖ్యానముగను, మనము గ్రహించినచో సర్వాలంకారిక మతములనొక కొలికికి తెచ్చినట్లే:

జగత్సంఘటన సహజముగ కవి సంస్కారమునకు రసస్ఫూర్తిని కల్గించని యెడల, అట్టి సంఘటనమును పునర్నిర్మించుకొనుటకు యితర పాత్రలను కల్పించుకొనుటకు రసవాదియైన కవి వెనుదీయడు. చరిత్రత కథలనే మార్పులు, చేర్పులుచేసి, రస స్రుతిని కల్గించుట నిపుణుడైన కవిచేయు ప్రక్రియ. కవిత్వము ఆలోచనాపరమైన నిర్వృతి (సుఖము)ని కల్గించును. ఆ సుఖము దీర్ఘకాలముండును. కవి శబ్దములనే తీసి క్రొన్ని రస చిత్రము లొనర్చును. జీవన్మూర్తులను మలచును. ఛందోగతిలో పద్యరూప

మైన సంగీతమును కూర్చిపెట్టును. పాత్రమును హృద్రంగమున నటింపఁజేయును- ఊహాసుందరిచే నాట్యమొనరింపఁజేయును స్వప్నోద్యాన సౌధములను నిర్మించును.

వాల్మీకిమహర్షి కృత్యాద్యవస్థలోని కథను విశ్లేషించుటకంటెను కవిత్వము రసము అనువానికి ఏ ఆలంకారికులును సమ్యఙ్నిర్వచనము చేయలేదు.

వాక్పూర్వకములైన కవిత్వ సంగీతములుత్తమములు. సంగీత కవిత్వములు వాగ్దేవి స్తనద్వయమనియు, సంగీతమాపాత మధురమనియు, కవిత్వమాలోచనామృత మనియు రసవేత్తలు చెప్పిరి. సంగీతము సప్తస్వర సమ్మేళనములతో రాగములను ప్రస్తరించును. తత్స్వరరాగములు శ్రోత్రేంద్రియమును తాకినవెంటనే హృదయ ద్రవీకరణ కలిగి రసస్థాయి సముత్పన్నమగును. కవిత్వము పంచాశద్వర్ణ సమామ్నాయములతో శబ్దములను విస్తరించును. తచ్ఛబ్దార్థములు శ్రోత్రేంద్రియమునుచేరి, ఆలోచన ద్వారా హృదయమును ద్రవీభూతముగచేసి రసస్థితిని నిష్పన్న మొనర్చును :

ద్రాక్షఫలము నోటిలో వేసికొనికొనినంతనే మాధుర్యగుణముతో జిహ్వను తనుపును, ఆమలకమును నోటిలో వేసికొన్నచో కొంచెము కొంచెముగ స్రవించుచు కషాయామ్ల గుణములతో నమలుచున్నకొలఁది యా మధురిమ అమృతమయమై ఎట్టి నీరు త్రాగినను పానకమను భ్రాంతిని కల్గించును: సంగీతమిచ్చు మాధుర్యము సద్యః ప్రాప్తము-అలక్ష్యముగా ప్రాప్తించి, చర్వ్యమాణమై శాశ్వత స్మృతిగాసాహిత్యము మిగులును. మొదటి యానందము అవ్యక్తము: రెండవది చిదానందము. ఇవి రెండే చలన స్వభావములగు కళలు.

చిత్రకళలో స్థిరభావము యేకసన్నివేశముగా మాత్రమే చిత్రితమగును. ఇది స్థిరకళ. శిల్పము విలాస సౌష్ఠవములను మనోహరముగ నిర్మించగలదు. ఇదియు స్థిరకళయే: నాట్యమునందు లావణ్య లాలిత్యములు రమణీయముగ రూపుకట్టును. నాటకకళలో రసభావ వ్యక్తీకరణకు పుష్కలముగా ఆనుకూల్యము కలదు. కాని నాటక సంగీతములు సాహిత్యము నాలంబనముగా తీసికొనినగాని పరిపుష్టిని, రసతుష్టిని కూర్చుకొనజాలవు. కావున కవిత్వము రస సృష్టికి ఉత్తమోత్తమమైన కళ అని నొక్కి వక్కాణించవచ్చును.

ఇట్టి మహత్కళకును, పరిమితులును, అసమర్థతలును గలవు. శబ్దముల పైన నాధారపడుటచే ఈ కళకు శబ్దసౌష్ఠవము, అర్థజ్ఞానమును గల సహృదయులకు

లభించినగాని రసనిష్పన్నత అనుకొన్నంతగా చేకూరదు। సహృదయునకు భాషా జ్ఞానముండుటవసరము। కవి విన్యసించిన శబ్దచిత్రమును ఊహించుకొనెడి భావుకతయు కల్గినచో రససృష్టి నిరభ్యంతరముగ కొనసాగును.

కవిత్వమును రమణీయార్థ ప్రతిపాదక శబ్దజాలముగా అర్వాచీనుడైన జగన్నాథుడు నిర్వచించెను. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అను విశ్వనాథుని నిర్వచనమును, ఆనందవర్ధనుని ధ్వనిమతమును సమ్మేళన మొనర్చి "రస ధ్వని' సిద్ధాంతమును నిర్ధరించెను. నేటివఱకీ మహామనీషి వాక్యమే శిరోధార్యముగా నున్నది. రసమతము భరతుఁడు దండి మొదలైనవారు నిర్ణయించినదే। ఇచ్చట వేంగిదేశీయుఁడు, జగన్నాథునికి పూర్వుఁడునైన వాగనుశాసనుని (నన్నపార్యుని) రమణీయతా సిద్ధాంతమును రస ధ్వనికి జోడించి చెప్పటలో పండితరాయలు నన్నయభట్టు పట్ల తనకున్న అభిమాన విధేయతలను ప్రకటించెను. ధ్వని కావ్యమును గూర్చి ఆనంద వర్ధనుడిట్లు నుడివినాడు–

'యత్రార్థః శబ్దోవా తమర్థ ముపసర్జనీకృత స్వార్థౌ
వ్యక్తః కావ్యవిశేషః సధ్వనిరితి సూరిభిఃకథితః' (ధ్వన్యాలోకము)

ఏ కావ్యమునందు వ్యంగ్యోపస్కారకములగు శబ్దార్థములు రెండును అర్థమును వ్యంజనాబలమున సముల్లసింపఁజేయునో, ఆ కావ్యము ధ్వనికావ్యము. ఇచ్చట శబ్దార్థములు రెండును వ్యంగ్యార్థమునకు వ్యంజకములగునని భావము. స్థూలముగా అర్థస్ఫూర్తిని కలిగించెడు శబ్దములను విడచిన,ధ్వనిమాత్రమైన భావవ్యంగ్య చిత్రమును సహృదయుని మనఃఫలకమున లిఖించుచో దానినే "ధ్వని" అని చెప్పవలెను.

ఇందు భావము స్థిరముగానుండక చలనశీలియై కదలాడుచు రసరేఖలలో ప్రకృతికి ప్రతికృతిగ చిత్రమును గీయుచున్నది. ధ్వని కావ్యమున నేర్పడు రసము మనోభూమిలో ప్రసుతమైనదికాదు। బుద్ధి (మనీష) విశేషముననే వ్యంగ్యము పరిపోషింపఁబడుచున్నది। ఇచ్చటి యాలోచన నిజముగ రసపర్యవసాయి కాదు. విజ్ఞాన విశిష్టమైన ప్రతిభచేతనే మహాకవి యిట్లు ధ్వని కావ్యమును వినిర్మింప సమర్థుఁడై యుండును. ప్రతిభయనగా నవనవోన్మేషప్రజ్ఞ। నిత్యనూతనము, చిత్సమేతమునగుని ప్రతిభ పురాసుకృత ప్రాప్తము.

ధ్వని కావ్యముగ హాలుని సప్తశతిని పేర్కొనవచ్చును. ముక్తకములగు గాథలలో పొడిగిన వ్యంగ్యము నిరంతధారాస్రుతియైన కావ్యకథనమున కంతరాయ మిచ్చును. కథాగమనమే కుంటువడినచో రసస్థాయి భంగింపఁబడును. అనగా ధ్వనికావ్యము సహృదయుమును ద్రవీకరణ చేయుట కుపయుక్తముకాదు ; ఝటితి స్ఫురణము రసస్పృష్టికి అత్యంతావశ్యము ; అట్టిచో ధ్వనిపూర్ణకావ్యము ప్రతిభా ; ప్రజ్ఞాన్వితునకు హ్లాదము కల్గించునట్లు శబ్దవేత్తయగు సహృదయునకు కల్గించదు. అందుచేతనే తన్మయతకు రసస్రుతికి కావ్యమే కావలయును ;

రసము గుణోత్తరము ; రస ప్రధానమైన కావ్యమున ధ్వని క్వాచిత్కముగ భావ వ్యంజకత కుపకరించినను, ఆమేర కచ్చట రసస్రుతి భంగింపఁబడుననియే సిద్ధాంతము ; రసవత్కావ్య సృష్టికి ధ్వని, గుణీభూత వ్యంగ్యము, అర్థాంతర వాచ్యము, భాషా సౌలభ్యము, ఝటితి స్ఫురణ కల శబ్దప్రయోగము—ఆవశ్యకములు. ; వీని నెఱిఁగి వాడుకొనిన కవి మహాదృష్టవంతుడు;

రసస్పృష్టికై స్వయంభువుడైన కవి హృద్గత విషయజ్ఞానమును తత్తదవసరోపయుక్తముగా నొనర్చుకొని మహాకావ్యమును విరచించును. లోకవృత్తములను సంగ్రహించుకొనిన కవ్యాత్మ కృత్యాద్యవస్థలో బహుపుష్పమకరందమును సేకరించి కోశమున కూర్చబోవు మధు మక్షికము వంటిది. మకరందమును కుక్షిపూర్ణముగ పానముచేసి స్వీయ జీర్ణకోశరసముల మిశ్రితమొనర్చి మధుపాయి సమాజమునకు పథ్యకరమగు మధువుగా అందించుటలో మధుమక్షికమునకున్న రసకల్పనైపుణియే మహాకవియైన రసహృత్తునకును ఉండును. బహువిధ పుష్పమకరందమును ఏకముఖముగా అనుపాన యోగ్యముగ ఔషధీకృతమొనర్చి కోశమును పూరించుటయే సత్కావ్య రచనగా మనము గ్రహించవలయును.

విద్వత్కవులలో భాషావేత్తృత ఘనీభవించియుండును. అల్పశబ్దగతమైన భావస్ఫురణ వారి హృదయములను సద్యోద్రవీకరణ గావింపనేరదు. క్లిష్టశబ్దభూయిష్ఠ సమాసమును విగ్రహించి, వచ్చిన భావమును పరిగ్రహించుటలో వారు పడెడి శ్రమ క్లేశానంతరము లభించెడి ఫలమై వారికి తృప్తినిచ్చును. కవితావనితకు శబ్దధ్వన్యలంకారభార పదములతో గమనము కుంటుబడుచుండును. అప్పుడు ఆ కోమలి కవితారమణి రసకేళీ విహరణ చేయుటకు యెంతయో శ్రమించవలసియుండును.

గోస్తనీఫలగతమైన నిసర్గ స్యందమానమగు రసమును నిబద్ధమొనర్చుటకే తత్ఫల త్వక్కు ఉపకరించునట్లు, మధుర కవితా రసమును నిబంధించు పాటి స్వల్పకార్యమునే పదజాలము చేయవలయును ; అప్పుడే కవిత్వమున శబ్దము రసస్రుతిని నిబంధించు బహిఃకవచముగా నుండగలదు.

ఝుకేతి స్ఫురణకృచ్ఛబ్దసంప్రయోగము సత్కవిత్వము యొక్క ప్రయోజనమును శతధా ప్రవృద్ధ మొనర్చును. అనగా కావ్యశైలి మధుర ప్రసాద రమణీయమై మృదుపద కమనీయమై యుండవలెనని సిద్ధాంతము

ప్రస్తుత కావ్యానుశీలనమున కవికున్న యోగ్యతను విచారించవలసి యున్నది. ఇచ్చటి కావ్యకర్త శ్రీ మల్లాది శివరామశాస్త్రి. సంస్కారపుష్కలమగు వంశమున జన్మించుట, ఆ యింటనే అలవడిన శృతిపక్వ శబ్దములను గ్రహించుటలు క్రొవిగొట్టమున కోయిల గొంతును చేర్చుటగా తనకు, మనకు దక్కి నేటికి తెలుగున కైతలను విన్పించుటగా మిగిలియున్నది.

స్వాతంత్ర్యోద్యమము భావతంత్ర పద్యనియమమై బాల్య యౌవనములు సాగిపోయినవి. ఉద్రిక్తహృద్రక్తమనేక ప్రచారగీతములను పద్యములను ప్రసార మొనర్చినది. ఆ అమ్మకు పుట్టిన అర్భకులు సంగీతపాటకులే ! సాహిత్యపాఠకులే! వారియింటి భోజనము సహృదయులకు షడ్రస (షట్కళా) పరిషేచనమే ! ఇంతటి సంస్కార ప్రభావిత భావకళాబలిత సహృదయుండైన కళాస్రష్టను స్తబ్ధుడిగా కూర్చొన నీయదు. నిత్యవేగి, సత్యవేదియగు కవియొక్క ఆత్మ కావ్యరచనకు నిర్నిద్రమై పరుగు లెత్తును. సమవృత్తములను సర్వపించుట, అనగా 'ఉత్తపెత్తవేసి మత్తేభములు సాకవలసి వచ్చుటయే' యని యీ కవికి తెలియును. ఇతరులకును తెలియును. కాని వారు ముచ్చటపడి తెచ్చుకొనిన ఆ యేనుగులకు ఎన్ని శబ్దములను పత్రబహుళముగా కబళములు నందించినను వానికి 'దాణా' సరిపోదనియే చెప్పవలెను. ప్రజల హృదయములలోనికి తాను భావించిన సత్యపదార్థ రసమును సూటిగా కాంతాసమ్మితముగ ఆటవెలదితో వేయవలెను, తేటకొలది కందములలో తిక్కనవలెను చెప్పవలెనని యీ కవి తీర్మానించుకొని యుండనోపును.

"వేమన తెలుగు" - గొంతులోను, "తిక్కన తలపు" - గుండెలోను (హృత్కందమున) దాచుకొన్న శివరామశాస్త్రి హరిహరాద్వైత సిద్ధితో సర్వము దాను

మయముగా కావ్యమును నిర్వహించుట కుద్యమించెను. అన్యాయమును సహింపలేని, ఆదర్శమును వహింపలేని ఆదికవిని, ఆంధ్రీకరించినచో శివరామశాస్త్రివలె రూపుకట్ట గలఁడు. కతిపయ మృదుపద సమ్మేళనమున భావనామయ వర్ణచిత్రము రచించు చాతురి యీ కవి 'అక్షరతూలిక'కు భగవద్దత్తమై లభించినది. రామాయణముగ, సీతా చరితముగా, పౌలస్త్యవధముగ త్రిపథగా ప్రసవించిన జాహ్నవీ పవిత్రమైన యీ మహాకావ్య స్రుతికి వల్మీకోద్భవుఁడు ఒక హిమవద్గహ్వరము!

రాముని పాత్రనెట్లు తీర్చవలెనో హతక్రౌంచ శోకసంవేదియైన జిజ్ఞాసువు త్రిలోకసంచారి నారదముని సంప్రశ్నము చేసెను. నారదుఁడు రాముఁడెట్టివాఁడో వివరించెను. అనగా ఆలంకారిక ప్రామాణ్యమున నాయకలక్షణ రససిద్ధి రామపాత్రలో పరిపూరింపఁబడియున్నది కరుణ, ప్రధానరసముగ ప్రాచేతసుని వాక్కుగ, నీ రస సత్కావ్య స్రోతస్విని సముద్గమించినది. "ఏకో రసః కరుణఏవ" వాల్మీకి ననుసరించుచు మహాకవి భవభూతి మరొకసారి వియోగిని (సీత) క్రౌంచముకొఱకు అశ్రుతర్పణము చేసెను. ప్రధాన జాహ్నవి కరుణగా అనేక శాఖోపశాఖ రసోపనదులతో యీ కావ్యగతి పరిపుష్టమై మహాకరుణరస తరంగిత ప్రవాహమై ఆనందవార్ధిలో సంలీనమగు టకై ప్రాగభిముఖముగ ప్రవహించుచున్నది. నిత్యనిర్వృతి కాంక్షితులైన సహృదయులు తత్తద్ఘట్టములలో రసావగాహన మొనర్చుచుందురు. ఈ కావ్యజాహ్నవి హిమవదుత్తుంగ భావుకుడు ప్రాచేతసుని దత్తపుత్రియై సీతాచరితమై మనకు ప్రత్యక్షమగుచున్నది

ఈ బృహత్కావ్యమును సంగ్రహముగ సమ్యగ్విపులముగ సారభూతముగ తీర్చి అనువదించిన కవులనేకులు గలరు. సంక్షిప్తమయిన రామ కథాసారమునందు స్పందన కలిగిన రసమున్నది. ఆ రసము ఆస్వాద్య మధురముగ నున్నది. తన్మధు రిమను (మధురలక్షణమును) మాత్రమే సహృదయులకు స్పందనగా అందించుట స్థూల ముగా 'రసధ్వని' కాగలదు. ఇదియే శిఖరాయమాణమైన సిద్ధాంతముగా జగన్నాథ పండితరాయలచే నిర్ధారితమై యున్నది. ప్రాచ్యఖండములోని సనాతనులు పురాతనులు నగు ఆలంకారికులు కాని ప్రతీచ్యభూమిలోని ప్రాచీనార్వాచీనులగు సౌందర్యమీమాంస కులుగాని, ఆక్షేపించి యీ రసధ్వని శేఖరత్వమును నేటివఱకు పూర్వపక్షము చేయ లేకుండిరి. అనుభావ విభావ సంచారి వ్యభిచారి భావనిష్పత్తిచే సముత్పన్నమైన రసము స్థాయీపర్యవసాయి మాత్రమేగాక సహృదయ రసస్ఫూర్తిగా చిత్రింపఁబడినచో

కావ్యకళకు సముదాత్తత, సుధాప్రవమత్తత సిద్ధించును. అందుకొఱకే రసము
ధ్వనిమాత్రముచేసి పాత్రగత పూర్వవాసనాస్మృతిని మిగిల్చి రచించుట శ్లే
క్లిష్టతరమును. సుగంధితైలములోని ద్రవభాగము కూడ నిశ్శేషమై కేవలపరి
మిగిలియుండి ఘ్రాణతర్పణము చేయుటవంటిది ఈ రామాయణ సౌరభమునకు ప
సౌరభము.

ఈ సౌరభమును సుహృత్క్షేత్రములలో నిక్షేపించి తన్మనోహరత
లను వ్యాపింపఁజేయవలెననిన కవి బహుపరిశ్రమ చేయవలయును. అందుకు
క్లిష్టతగాని, భావక్లిష్టతగాని అడ్డుతగలకూడదు. మార్దవమైన భావమును అ
భాషలో చెప్పవలసివచ్చును. కథాగతిలో పలుమార్పులు చేయవలసి వచ్చును.
సాంకేతికములగు నామములకు వ్యుత్పత్తులను వివరించవలసివచ్చును. కథాప్రతి
ధర్మములను వాచ్యము చేయవలసి వచ్చును.

రస నిష్పన్నతను, వివిచ్యమానధ్వని సంపన్నతను, వ్యక్తమొనర్చు
చేయవలసివచ్చును. వ్యంజితమును వాచ్యము చేయుటవలన సత్కావ్య లక్ష
సంక్షిప్తత భంగించఁబడును. ఉక్తధర్మములను పౌనఃపున్యములుగా వివరిం
కావ్యమునకు నీతిశాస్త్ర లక్షణము పట్టి కవితాత్మ ఉపహతమైపోవును

కథాగతిలో అర్థాంతరవాచ్యములు ప్రాయికములగుటచే అతివ్యాప్తిదో
కావ్యమున కుదురుకొనును. కావ్యగత లక్షణదోషముల నన్నింటి నధిగమించి
ప్రవృత్తి, చిరనిర్వృతి సృజించుట, అందునను ఆ రసముమీద స్మృతి పర్యవసా
మనన క్రియమాణమై అమృతసిద్ధిఁ గూర్చుట యీ రామాయణ సౌరభము గ్రంథ
ఉన్నతశ్రేణికి తీసికొనిపోవుచున్నది. సాంప్రతిక రామకావ్యములలో గణనీ
మిచ్చుచున్నది.

వేదకవి "ఆనోభద్రాః క్రతవోయన్తు విశ్వతః" అని వచించిన
బహిరింద్రియ వాతాయన ద్వారములనుండి సర్వదిక్కులలోని భద్రంకరములగు
ములు అంతరింద్రియములను చేరనుగాక! ప్రత్యక్, పృథక్ కథాభాగములను
శించుచు అరసికుడ నగుట నా అభిమతముకాదు. కావుననే, రామాయణామర ప్ర
లోని అకర్దమతీర్థ ఘట్టములలో సహృదయులు స్వకీయ పాత్రయోగ్యమాత్ర

రసోపలబ్ధిని సంగ్రహించుకొనగలరని శుభాశంసన. సోదాహరణముగ కావ్యానుశీలన మొనర్చుట సూచ్యమును వాచ్యమొనర్చుటయే !

భాషాజటిలతగాని, భావకుటిలతగానిలేని ప్రస్తుతరచన - శబ్దపరళముగను, అర్థతరళముగను సాగినది. ఈ మధురసమయమున నేను - పానకమున పుల్లనై - అడ్డుపడికుండుటయే మంచిది !

"జయంతితే సుకృతినోరససిద్ధాః కవీశ్వరాః"

బంధురసాదర స్పృహులు - భవ్యసుహృద్రసహృద్వహుల్ - సమ
స్కంధులు - శ్రవ్య దృశ్యరసకంధులు - శ్రీ శివరామశాస్త్రి సం
గ్రంథిత రామకావ్యవన గంధవహ ప్రవహద్ గవాక్షమీ
సంధిత లక్ష్యలక్షణము; సాధిత పుణ్యలసత్ క్షణమ్మహో !

రక్తాక్షి చైత్రశుక్ల ప్రతిపత్
2-4-1984
విజయవాడ - 11

సుధీవిధేయుడు
చల్లా సీతారామాంజనేయులు,
'అంతర్వాణి'

"Come not to mythology with ideas of history and reasoning. Let it flow as a current through your mind, let it be whirled as a candle before your eyes without asking who holds the candle and you will get the circle, the residuum of truth will remain in your mind. The writers of mythologies wrote in symbols of what they saw and heard, they painted flowing pictures. Do not try to pick out the themes and so destroy the pictures, take them as they are and let them act on you. Judge them only by the effect and get the good out of it."

**SWAMI VIVEKANANDA WORKS**
**VOLUME VII PAGE 88.**

"Endowed learning is apt to be timid and conservative learning, lacking in initiative, unless it has the spur of contact with independent minds."

"Man will listen dispassionately to the most divorse suggestions about stars or molecules but ideas about our ways of life touch and reflect upon everyone about us."

"Marx sought to replace national antagonisms of class anta-gonisms."

From a short History of the World by H. G. Wells.



# కావ్యానుశీలనము

మానవునే దైవంగా
మలచె ద్రష్టయైన కవి
దైవంలో మానవతను
తడవె భక్తుడైన కవి.

అర్థస్ఫూర్తికి తబ్బి
బైబరి సాహితీపరులు
పరమార్థమ్మనుభవముగ
నెరుగనట్టి కుకవివరులు.

రసాభాస వర్ణనలే
అసలు కవితలన్నారు
పసమాలిన భౌతికముల
రసస్ఫూర్తి తడివారు.

ఛందమ్మనగా వేదము
ఛందోబద్ధము కవితయు
విశ్వాత్మను దెలుపనట్టి
వెఱ్ఱివ్రాత కవితకాదు.

పక్షిచావు కంటజూచి
వాపోయెను వాల్మీకి
వాపోవుట వాగతీత
మైపోవుట, అది సమాధి.

రాముడు కాదలచు నడక
శ్రీమద్రామాయణము
కాదలచినవాడే ఆది
కావ్యమ్మును వ్రాశాడు.

కాంతాకాంచన వశులై
కవిత లమ్ముకొన్నారా
రాజాశ్రయమునకై భ
ట్రాజులుగా మారారా !

పరమార్థము మరచి స్వర్గ
పసులై పడిపోయారా !
కామ కర్మలకు పట్టం
గట్టి యజ్ఞమన్నారా !

నామరూపయుత జగమే
రాముడగుట మరచారా !
నామస్మరణైక మాత్ర
మే మోక్షం అన్నారా !

రాముడెడదనిండి పలుకు
నామస్మరణము జపము
నామరూపయుత జగమున
రామదర్శనమ్మె తపము.

## కావ్యాను శీలనము

వేద మపౌరుషము సకల
వాదమ్ములు పౌరుషములు
అనుభూతిని గూర్చి తెలుపు
నన్నియు మానస కృతములు.

దైవమ్మును వేదమ్ములు
జ్ఞానగమ్యమని నుడివెను
వేదార్థ ఉప బృంహణ
విధమే రామాయణము.

ధ్వని సర్వస్వము, కావ్య
మ్మున గౌణమ్ము లెన్నినో
ఇంపుమాని కథనే పరి
కించుట అసమగ్ర దృష్టి.

వల్మీకమ్మున బుట్టుట
వాల్మీకి అనంగబడియె
ధ్వనిపూరిత శబ్దమగుట
వల్మీకమ్మున దేహమె.

వాల్మీకి వ్యాసాదులు
భగవాను లనంగ బడిరి
కావ్యసృష్టి కర్తల నా
కరణిననుట సమంజసము,

జ్ఞాన మ్మొకరి సొమ్ము
కానే కాదాత్మవంతు
లైనవారి యనుభూతులె
జ్ఞానము ఇక దైవమన్న.

ఉన్నాడా లేడా యని
ఉంటూ ఉంటుంది చర్చ
ఎవరికివారుగ తెలిసెడి
వివరమగుట శంకసాగు.

సుఖదుఃఖము లున్నవి; కను
చూపున కవియును తెలియవు
అనుభవమున తెలిసెడివవి
అత్యంతాత్మీయమ్ములు.

విన్నది కన్నది తెలిపెడి
విధమును భావంబందురు
నవరసగుంఫిత భావ
ప్రవణతయే రసావాప్తి.

భావమ్మా చరణమ్మున
పరిణతమగు టాదర్శము
అద్దములో చూచుకున్న
అంతరంగమే కావ్యము.

కావ్యమ్మున భిన్నభిన్న
కథలు గాథలును బోధలు
మానవతకు కావ్యము ని
ర్మల నిర్మమ ముకురము.

మానవులనె గుణము బట్టి
దానవులని దేవతలని
కిన్నర గంధర్వ యక్ష
కీశులుగా వర్ణించిరి.

రూపమ్మది యాకన్నుల
చూపుననే కన్పించును.
భావాత్మక రూపము గను
త్రోవలు కావ్యపథమ్ములు.

క్రాంతదర్శియౌ మహర్షి
కావ్యమ్మున నెన్నెన్నో
చూపులు, మలుపులు, మానవ
తాపత్రయ దర్శనములు.

కథ లౌకికమౌ నవ
గాహనమేకాక ఆత్మ
కథలన్ ధ్వనియించి మనో
వ్యథ బాపెడి దివ్యౌషధి.

అంతరాంత రార్థము స
ర్వాంతరాత్మ బోధించుచు
అంతుపొంతులేని అహము
నంతరంగముల గాథయు.

కావ్యధ్వని బధిరులైన
కథా మాత్ర విదులంబడి
రామాయణగాథ కదన
రంగనాయకుల పాల్పడె.

కథగా మాత్రమె చూచిన
కావ్యనాటకేతిహాస
పూర్వపురాణము లన్నియు
బొంకు రంకుగానె తోచు.

ధర వెలసెడి మగవారికి
తల్లి, తన్వి, తనయ స్త్రీయె
సృష్టికర్త కేస్త్రీయును
ఏమియగును! ఏమికాదు!

కనుక వారిబాంధవ్యము
మన మనుకొనురీతి కాదు
అన్ని ఒకటియయ్యు భిన్న
భిన్నంబుగ తోచు సృష్టి.

కావ్యానుశీలనము

కథ లోకవ్యవహారము
కావ్యము ధ్వని సర్వస్వము
కనపడుదానిని గూర్చిన
కథ యెట్లగును సమగ్రము!

అది నీవే 'తత్త్వమసి'
ఇది నేనే 'అహంబ్రహ్మ'
'సర్వం ఖల్విదం బ్రహ్మ'
'ప్రజ్ఞానం బ్రహ్మ'.

తెలిసికొనెడి తెలియబడెడి
తెలిపెడిదియు నొక్కటే
అదిలేనిది యెదియులేదు
అదికానిది యెదియుకాదు.

ఇతరమ్మే లేనప్పుడు
ఇది యొకటే యైనప్పుడు
ఇన్నియు నదే యైనప్పుడు
ఏ భేదము లేనప్పుడు

స్త్రీపుంసాత్మకమగునీ
సృష్టియు నదె యైనప్పుడు
దృశ్యమాన భిన్నతలను
దెలుపుటకే కావ్యకథ.

ధృక్పథమునుబట్టి కదా
ఇల నెదియే ధర్మమనియు
ఏదియే నధర్మమనియు
యిదమిత్థముగా దేల్చుట.

శౌచక్రియ జేసి నిద్ర
కాచి యహరహమ్ము తల్లి
ప్రాణాధికముగ బిడ్డను
పాలించును దైవమట్లు.

దైవముగా నెంచదగిన
తల్లి నసంబుద్ధమతులు
దాసీయనవచ్చు నేమి
జేసిననుం జేయవచ్చు.

భర్తను దైవముగ నెంచు
భార్యగాని, తనభార్యను
దేవతగా మన్నించెడి
చేవగల్గు భర్తగాని

ఎవరికివారు స్వతంత్రులు
ఎవరెవరికి పనులుకారు
సేవకసేవిత భావము
జీర్ణించిన చిలిపి తలపు.

కావ్యానుశీలనము

ఎవరి పరిధి వారిదియై
నవనవోన్మేషముగా
ప్రవణతగల్గు గృహస్థులు
నవరింపరె కాపురములు!

మానవతకు మార్గము రా
మాయణమై నైవన్మే
మానవుడుగ మెలగెడి స
న్మార్గము వాల్మీకి చూపె.

క్రాంతదర్శిగాన కార్య
కారణయుత పాంచభౌతి
కమ్మగు భువి నొక్క మహా
కార్యముగా దర్శించెను.

ప్రకృతిని బట్టి సురాసుర
వానర నర కిన్నర గం
ధర్వ యక్ష రూపమ్ముల
తత్త్వము దర్శించి చూపె.

కథ ఖిలమును గూర్చి తెలుపు;
కావ్య ధ్వని అఖిలమ్మును
ఏకైకము నద్వైతము
లోకేశ్వర భావనమ్ము.

కథ సర్వముగా నెంచెడి
కారణాన అడుగడుగున
దేహాబుద్ధి కెన్నో సం
దేహమ్ములు బాధించును.

ప్రశ్నించుట కావ్యభావ
పరిపుష్టియె; సౌహృదమే
ప్రశ్నలె జిజ్ఞాసువులకు
పథ్యమ్ము అగత్యమ్మను.

వెక్కిరింత, కొంటెప్రశ్న
విజ్ఞులుపేక్షింతురు
అన్యులు వగతురు పండిత
మ్మన్యులు పోరాడెదరు.

దేని దెలియగా నైనను
దృక్పథముల దెలియవలయు
భిన్నతలో నేకత్వము
గన్న దృష్టి 'దర్శనమ్ము'.

క్షేత్రము జనకుడు దున్నిన
సీతమ్మ లభించెడినట
క్షేత్రమ్మన పొలమ్మే ఆ
మాత్రమెయగు వాచ్యార్థము.

ఆ పొలమును కనుగొనుటకు
ఏ పరిశోధనమైనను
చాపల్యముగా తోచును
పాపమ్మని జాలికలుగు.

ధ్వన్యర్థమ్మున క్షేత్రము
తనువే; జనకర్షియంత
ధార్మికునకు తనువున సీ
తమ్మ లభించెడినట.

పరిశోధన పరమార్థము
నెరుగుటకై జరుగదగును
అవహేళన లక్ష్యమైన
ఎవరేదియే నసవచ్చును.

అదిభౌతిక మధిదైవిక
మధ్యాత్మిక మధిలౌకిక
మధిజ్యోతి షార్థమ్ముల
నద్భుతమగు పరమార్థము.

భౌతికవిజ్ఞాన మఱువు
పరికించునె కన్నులతో !
సాధనములు దాని, కాత్మ
సాధన యొనుకకును వలయు.

పంచభూతాత్మక ప్ర
పంచము దేహము నొక చే
దేహికి తనదేహము నవ
గాహన ఆత్మజ్ఞానము.

తెలియదగినదాని నెట్లు
తెలియుటో తర్కము తెలుపును
తన్ను దా నెఱుంగు రీతి
తర్కాతీతానుభూతి.

ఈ లోకము సూక్ష్మముగా
నీలోనే యుండుట నీ
లోచూపునగాని లోని
లోకము పరికింపగాదు.

తను సుఖదుఃఖముల కెల్ల
మనముననే యనుభవము
భవభారమ్మనుభవమే
బంధమోక్షములు మనసే.

పంచేంద్రియ భౌతిక ప్ర
పంచముద్రితమ్ము మనము
తనుమనముల వెడగనున్న
దాని ఎరుక ఆనందము.

తెలిసెడి సుఖముల దుఃఖము
కలసియుండు నెల్ల వేళ
నిద్రించితినని తెలియని
నిద్రకన్న సుఖము లేదు.

సుఖ దుఃఖాతీతమ్మగు
సోలుటయే ఆనందము
స్వస్థుని పరమానందా
వస్థయె యగు యోగనిద్ర.

ఎవరికి వారే దీనిని
వివరముగా నెఱుగదగును
వివరణ, వ్యాఖ్యయు నిల నను
భవ మెన్నడు కానేరదు.

ఆనందము గూర్చి తెలియ
నానందము మానసికము
అనుభూతియె ఆధ్యాత్మిక
మా నిర్ద్వందానందము.

'భజ' యనగా తానగుటయె
'భజన' తాను దానగుటకె
ఎవరేది భజింతురో అను
భవమున వారది యగుదురు.

తనయులు 'తన' యైనట్లిల
దనువులెల్ల తనవగుచే
దైవత్వం బనియె "అమ్మ"
తాదాత్మ్యమె దైవత్వము.

అన్ని తానెయగుట దైవ
'మహామస్మి' యె బ్రాహ్మీ స్థితి
అది తెలిసెడి దృక్పథమును
ఆత్మాలోకన యందురు.

ఆచరణ ప్రామాణ్యము
అనుభవ సర్వస్వము
ఆనంద మ్మోకైకము
అంతరాంత రానుభూతి.

ఆచరణాత్మక జ్ఞానము
అంతస్థ్సితు వర్తనము
ఆచరించుటకె దైవము
అవతరించు మానవుడుగ.

దైవత్వము నెల్ల యెడల
దర్శించుట దైవత్వము
పురుషోత్తముడే దైవము
ధర పురుషుడు దైవమొకడె.

దృశ్యమాన జగమందలి
ఏకత్వము విజ్ఞానము
అన్నిటితో నద్వైత
మ్మన్నదియే ప్రజ్ఞానము.

ప్రజ్ఞ గల్గువారి త్రోవ
రాముని అయనమ్ము
ఆత్మను శిక్షించుకొనుటె
'అత' డెల్లరి రక్షించుట.

ఈయవగాహనమే అన
సూయమ్మగు దృక్పథము
జగదాత్ముని ఆచరణమె
జ్ఞానప్రద జీవనము.

ఆచరణకుగాని 'రాము
నయనము తెలియుట వనము'
తమ తమ ఆచరణములే
ధర్మమునకు గీటురాయి.

వ్యాసకృతములం గూర్చిన
ప్రశ్నల నట్లుంచి, కొన్ని
వాల్మీకములోని కథన
వైరుధ్యమ్ముల జూతము.

"ముగురి గట్టుకొని మురిసిన
ముసలి తండ్రి గొప్పలకై
ఇల్లు విడచినట్టి భర్త
నెత్తిపట్టె క్రీత సీత"

"తమ్మునకై రాజ్యమ్మును
ధారవోసినట్టి రాము
జగము లేలు భగవంతుని
సాటియనిరి పురుషకవులు"

"దారాపుత్రాదులకై
తమకున్నది సర్వస్వము
ఇచ్చివుచ్చుకున్నవార
లెంతమంది పుట్టలేదు !"

"శత్రురాజుజంపి అతని
సహజన్ముని రాజుచేయ
రే ! జగమున కూటనీతి
నెరుగు రాజులెవ్వరైనను ?"

"తన వంశము పరువునిల్పు
దంభదర్ప శిఖామణికి
అన్నజంప సాయపడిన
యాతడు భక్తశిఖామణి !"

"వలచివచ్చు పూబోడిని
వలవల ఏడ్పించుటయే
ధర్మమూర్తి కౌచితియా !
తన్వి పసువు కాల్చిన చితి !"

"ఒకశరమున ముజ్జగముల
నుక్కడంచు జగజెట్టికి
చెట్టుచాటునుండి కోతి
గొట్టు టేమికర్మమగును !"

"యుద్ధధర్మ మెసగువార
లుమ్మదురే నేలపైన
రాజాశ్రయమున కవితను
బూజుపట్టు విధముకాదె !"

"లంకనున్న భార్యను దా
శంకించిన గావనేల
మూఢప్రజ మెప్పులకై
ముదిత నగ్నిద్రోయనేల !"

"శుద్ధమూఢు డేదోయన
చూలాలిని దోడ్డిదారి
నడవి కనిపి స్త్రీలోకము
నవహేళన పాలుజేసె."

"రాజాశ్రితకవి శ్రీమ
ద్రామాయణ కావ్యమ్మున
అసామాన్యమైన ధర్మ
రసాభాస మొనరింపడె!"

"త్రేతాయుగమున మొదలీ
తేలికబారు ప్రచారము
ఆర్యుల విజిగీషకు రా
మాయణమే చిరసాక్షి"

ఈ మొదలగు సందేహము
లేతీరున తీరగలవు ?
ధర్మసూక్ష్మముల కావ్య
ధ్వన్యర్థమె బోధించును.

దశరథమగు తనువు భూమి
దశరథుడా భూమిధవుడు
సత్వరజస్తమ కల్పులు
చానలు ముప్పూరు పత్నులు

ఇష్టి యొసగు పుత్రుడు ర
క్షించును పున్నరక మెడపి
జనకుడు పిత కాడు కన్న
తనయుడు పుత్రుడును కాడు.

జనకుని పిత నిర్వరినిన్
తెనుగున తండ్రియె అందున
పుడమి నేలుమనెసు తండ్రి
అడవులేలె సత్పుత్రుడు.

జనకునిలో జగజ్జనకు
గనజాలును సత్పుత్రుడు
తనయు నాత్మ బింబముగా
దర్శించెడి వాడె పితయు.

త్రికరణ శుద్ధియె మానవు
దేవునిగా తీర్చిదిద్దు
అకలంకుండగు పిత కా
యిక కరణమున వీగ

తండ్రి ప్రియుడె, ధర్మమ్మది
ధరణికెల్ల శ్రేయమగుట
పుత్రుడు పితృధర్మము పరి
పూర్తికినై కానకేగ.

ధర్మాచరణము కొరకే
తల్లి తండ్రి యిల్లాలును
దానికి గానట్టి యెవరి
నైనను మన్నింప "డతడు".

ఆత్మస్థితుడైన వాని
ఆచరణమిద్దా దృష్టిని
తెలియగవలె; సామాన్యుల
తీరు తెన్నుబట్టి కాదు.

* * *

యక్షిణి తామసమున నొక
రాక్షసిగా వర్తించెను
రామశిక్షణమున తిరిగి
రామామణి రూపొందెను.

ధర్మము తప్పినవారిని
తమ ధర్మమ్మున నిలుపుట
జగమున తానవతరించి
భగవంతుడొసంగు శిక్ష.

ధర్మము మానవుని మనో
ధర్మమ్మే; అదికానిదెల్ల
సృష్టిస్థితి లయములలో
నిముడు ప్రకృతి లక్షణమే.

శిక్షయనగ తగుబోధల
రక్షించుటయే యననగు
తెగటార్చుట అవగుణముల
తగుమలుపున మలచుటయే.

గుండ్రాయిగ మారునన్న
గుండె రాయియయ్యె ననుట
కూర్మమువలె నింద్రియముల
కూడగట్టుకొను సాధన.

ఆరీతిని కావ్యధ్వని
దారి దెలియనట్టివారు
మాత్రమె పాషాణమంద్రు
మర్మజ్ఞుల దారి వేరు.

ఎవరికంట బడకయు దా
నెవ్వరినిం జూడకుండ
పదిమందికి దూరముగా
పడియుండగ మునిశపించె

శాపపరము లొక్కొక్కరి
చూపున నొకరీతి దోచు
వనమున గౌతమి వెతలం
బడెనన్నది వాచ్యార్థము.

ఇంద్రియముల నేలువాడె
యింద్రు; డనగా మనస్సు
తనమనసే తనమిత్రము
తన శత్రువుకూడ నదియె.

ఎంత పతివ్రతయు మనము
నెంత అదుపు చేసినను
పాదరసము నపహసించి
పరువులెత్తు మానసమ్ము.

మనసు జయించు నుపాయము
మాని యొసగు నుపదేశము
శాపముగాదోచు మన
స్తాపమె కాదే తపమ్ము.

ఇనకులమణి రాముని చే
తనమున నీ చేసెడి సా
ధన ధన్యంబగునని ముని
తన సతి నాశీర్వదించె.

*   *   *

అవ్యయమ్ము నూర్ధ్వముఖము
అధశ్శాఖ మశ్వత్థము
ఆకులు వేదములనియును
అనుపమముగ నుపమించిరి.

'శ్వః' అనగా రేపుకదా
'అశ్వః' నేడన్నమాట
వర్తమానమే అవ్యయ
వర్తనమని ధ్వన్యర్థము.

అనుభూతము మూలవృక్ష
మనుభవమగు భవము శాఖ
ఆ శాఖల వేదములను
ఆకులు పూవులు కాయలు.

ఆనందం బనజీవిది
వ్యానుభవము అదే తరువు
కదేశాఖ కదేయాకు
లదే కాయనదే పండు.

కార్య కారణా తీతము
చాటుననదె నేటుననదె
ముందుననదె వెనుకననదే
ఎందుయెందుననైన నదే.

చాటుగు నాత్మజ్ఞానము
నేటు వాలియహాము దాకి
ఛిద్ర మొడపి కపిభూముల
భద్రత వెలయింపజేసె.

అర్థవిరోధముల నెల్ల
అవగాహన తొలగించును
సమన్వయము చేసికొనిన
సందేహమ్ములు తీరును.

సమ్యగ్దేహార్థము నే
సందేహం బన జెల్లును
సామరస్యమే మనుజుని
జ్ఞాన ప్రజ్ఞాన పథము.

* * *

వేదవిదుండయ్యు నీచ
వాదుల జిక్కిన విప్రుని
సోదరు నవనీపతినే
నాదల దాల్పంగరాదు.

ధర్మము దప్పెడి వాఁడను
ధర్మమెఱుంగుదురు, నైజ
కర్మలబడి కామావశత
దుర్మార్గమ్మున బడెదరు.

భీషణ తాపత్రయ సం
శోషణభావము, విద్వ
ద్భూషణమైనట్టి విగత
భీషణమున్ సోదరములు.

ఒక భావము శాస్త్రియె మరి
యొకభావమునకు స్వస్తి
"నాఽవిష్ణుః పృథ్వీపతిః"
యోగిమతే కాదగు పట్టి.

లంకాసంపన్నతలకు
రావణపాలన శాపము
ఆత్మజ్ఞుని శిక్షణమున
అవనీపతి రాజిల్లును.

ఆత్మారాముడె భూమి స
మగ్రముగా నేలదగును
రాక్షసప్రవృత్తి మాపి
రక్షించుట కతడె తగును.

రక్షించుటకే దైవము
శిక్షించును; బోధించును
దీనిని కథగా మలచిన
వాని వ్యంగ్య మనుపమము.

బ్రహ్మర్షికి సత్కవికే
రాజాశ్రయమేల! వారి
నాశ్రితులని కించిజ్జ్ఞత
ననుకొనుటతి హ్రస్వదృష్టి.

లింగ వర్గ జాతిభేద
లేశము లేనట్టివారి
నెవ్వరేమియన్న వార
లవ్విధమని యెరుగదగును.

చతుష్షష్టి కళలు నవర
సమ్ములు రూపించుటకే
"రసోవై సః" పరంబ్రహ్మ
బ్రహ్మర్షి యొకండె సుకవి.

అద్వయమును దెలుప గాని
వన్నియు నసమగ్రము లే
తాదాత్మ్యము తానందిన
తజ్ఞుడె తథ్యము దెలియును.

భావాద్వైతము క్రియలన్
పరిణత మగుటయె ధర్మము
త్యాగము ధర్మమును రెండు
అవినాభావమ్మ లగును.

స్వార్థపరిత్యాగ మనిన
అహమును బోనాడుటయే
అహమునుండి 'అహమస్మి' కి
అయనము రామాయణము.

పుత్రునకై పురుషుడు తా
పత్రయపడు దేహధారి
'సోఽకామయత బహుస్యా
మేతి' యె సర్వజగదాది.

'ఆత్మా వై పుత్ర నామాసి'
అనునదియె ప్రజాతంతువు
కోరికలవి మూలముట్టు
తీరువరకు సంసరణము.

కొడుకులు లేరని వగచెడి
ఒడయుం డొక దశరథుండు
ఆతనితో ప్రారంభం
బగునది రామాయణము.

సంతానప్రదమగు తన
సతి మూలాలిని కానల
కనిపిన ధర్మజ్ఞుడు పతి
అరిగిన దా ధర్మపత్ని.

ధర్మాచరణమ్మున జా
ధ్యత ఉభయులకు సమమె
దేహీ మనసుచాయల పై
దేహీ బ్రతుకుటడవి దిరుగు.

సంయోగ వియోగమ్ముల
స్వారస్యము విలక్షణము
కలసి మెలగు టొక్కతీరు
విడిగా నదియొక్కతీరు.

ఒక్కటిలో సుఖదుఃఖము
లుభయమ్ముల ఆటకట్టు
ఆనందం బనిర్వాచ్య
మైన అద్వయానందము.

ఈ దాగుడు మూతల రూ
పించుటలో సంఘధర్మ
మిమిడి యిమడనట్టు లేటి
దృక్పథమున నట్లు తోచు.

ఏమటన్న ధర్మమ్ములు
నైమిత్తికములు నిత్యము
లుగ సలుకీతులు; భిన్న
మ్ముగ దోచియు వేరుకావు.

అనుపదమున నిత్య ధర్మ
మను సంధానము కావలె
ఏ ధర్మంబేని కాల
కృతమగు సందర్భశుద్ధి.

తెలుపనైన దెలుపక తన
తలపు మరుగుపరిచి పత్ని
యున్నదాని నున్నట్లు స
మున్నతమతి వెడలనడచె.

తృణప్రాయముగ రాజ్యము
దిగుచు పెద్ద అర్ధాంగిని
ధర్మపత్ని విడుట జ్ఞాన
కర్మసమగ్రత దెలుపును.

ఏ పనియో నెదియోనాక
చూపున సత్కర్మ; మరొక
చూపున దుష్కర్మ; ధర్మ
సూక్ష్మత యొక దృక్పథమే.

నిర్దుష్టత ఏ పనిలో
నేని యసంభవము; కర్త
పనినిబట్టిగాక వాని
భావముననె మంచిచెడులు.

ఈ విధమున ద్వంద్వమ్ముల
సేవించుచు సుంతం ప్రాపు
భావించెడి రీతిబట్టి
బాగోగులు తోచుచుండు.

తన భావమునకు పోనగని
దానిని కష్టమ్మని మనుజు
ధర్మని సూరనమ్మని [illegible]
[illegible]

తృణప్రాయముగ రాజ్యము
విడుచు పెద్ద అర్ధాంగిని
ధర్మపత్ని విడుట జ్ఞాన
కర్మసమగ్రత దెలుపును.

ఏ పనియో నేదియో నొక
చూపున సత్కర్మ; మఱొక
చూపున దుష్కర్మ; ధర్మ
సూక్ష్మత యొక దృక్పథమే.

నిర్దుష్టత ఏ పనిలో
నేని యసంభవము; కర్త
పనినిబట్టిగాక వాని
భావముననె మంచిచెడులు.

ఈ విధమున ద్వంద్వమ్ముల
సేవించుచు సుంతం బ్రాపు
భావించెడి రీతిబట్టి
బాగోగులు తోచుచుండు.

తన భావమునకు బోనగని
దానిని కష్టమ్మని మును
ధర్మవిహారమ్మని మాని
[illegible]

# వందేఽహం

హనుమంత మహం వందే
మరుద్వేగం మనఃకపిః
భూతనాథాంశ సంభూతం
సీతాన్వేషణ తత్పరమ్ ॥

నీసూవృత దృక్పథమున
మోసెద కపివర్య! తనువు మోతలతో ఆ
యాసం పడితిని, భౌతిక
వాసనలంబాపి ఆత్మభావము నిమ్మా!

నీవు మనఃకుసుమమ్ముల
తావుం దావియును, సర్వతాత్త్వికులకు నీ
త్రోవయెకాదె శరణ్యము
చేవయనన్ మనసురామసేవయె కాదే!

హనుమా! ఓయి మనోజవ!
మనము మనము నొకటి, సర్వమానవు లోకతే
తనువును నడపెడి నీ నా
మనమంది కపిచపల మింక మన మొకటెకదా!

లంఘింతు నేను సరిస
ట్సంఘామితఖాత దురిత సంసృతి జలధిన్
సంఘాత మోహరాక్షస
సంఘా! శబ్దార్థ సవ్యసాచీ! హనుమా!

సుందర రావణ లంకన్
సందడి సమయింపజేసి సహజావనిజా
సుందరము జేసితివి, చి
త్సుందరమై లంక ఆత్మసుభగంబయ్యెన్.

కపివయ్యును నమమించిన
కపి నీపెట్టినను కావు, కావనుటకు నా
చపలత, కర్మఫలాఫల
విపరీతాసక్తి, మనసు పెరపెర సోకుల్.

ఎంతకోతివి కాకున్న అంతలంక
గాల్చినాడవు! ఔదల దాల్చె రామ
కార్య మితడని మెచ్చె లోకమ్ము, భామ
నింత కాల్చని నన్దిట్టు నీ జగమ్మె!

మోహ మహితమైన దాహము, చెరువుల
నెన్నటనో మునుంగు నింద్రియములు
ఆర్పి నార్పగలదె ఆజ్యమ్ము! కోర్కెల
గడ్డి తనువులంక గాల్చితీవు.

పోక దాలంకనెగ నీదు తోకకేని
పాపపుణ్యాల కాత్మ లోబడనియట్లు
నీవు కాల్చుటయున్నది నెపముకాని
తామసమున లంక మున్సోకిన గాలుచుండు.

నోరు రావణమ్ము, కోరిక ముప్పేట,
మోహశూర్పనఖము, మొద్దునిద్ర
కుంభకర్ణతమ మకూపార వేష్టిత
దేహలంక గాల్ప దిక్కు నీవె!

గ్రహములు తోడై నాదు
ర్గ్రహణ మహంభావ ముడిపి రామాయణ సం
గ్రహసర్వస్వము లంకా
దహనాంతరతత్త్వ దివ్యదర్శన మగుతన్.

దశదిగ్భ్రమణ వినోదము
లశాంత మానసపయోధి నవ శేంద్రియముల్
శిశుచపలు ముంచె, తేల్చె
వశీ! వినుత లంఘనప్రవణ! రణశూరా!

అరి నొక్కని జంపగ మగ
సిరిగల మొనగాని కీవు చేసితి సాయం
బిరిపట్టు పరుషవాగ్దు
ష్కరు నరయుము కరుణ సామగాన సుధాబ్ధీ!



ఓంఅని ప్రారంభించెను
భూజాతను దలపోసెను
భువనమెల్ల కలయదిరిగి
వనములెల్ల గాలించెను
సుదతీమణి పూర్ణచంద్ర
వదనను కనులారగాంచి
తత్సన్నిధి మోకరిల్లి
సవితృ వంశ వరేణ్యుని సం
భవమున భవునిన్ [illegible]స
రోచితమగురీతి దెలిపి
దేవత లానందింపగ
వసుధాసతి కూతుని ఆ
స్వ్యాముగని ఉప్పొంగి పోవ
ధీవరులకు త్రోవదోప
మహి మహిమా సంహితమై
ధియోదీప్తి దీపింపగ
యోగి బృంద సముద్ధరణ
యోగము సంసృతిని బాప
సహ రహమ్ము తహతహపడి
ప్రకృతి శక్తి నపహరించు
చోరుల శోధింప నెంచు
దరి పావనపథముల భూ
యాత్ శుభమ్ము శంకరము.
"క్రియా స్సిద్ధి స్సత్వే భవతి."

# రావణలంక

శ్రీల బలిసియు చింతలంజిక్కి మనము
యోమయము కాగ విజ్ఞగర్వోపహతజ
నమ్మెత్తేచ్ఛగ ద్విరదయూథమ్ము వోలె
జట్లుగా లంకవీథుల సంచరించు.

రాజమార్గములెల్ల నిరంతర ప్ర
బోధ రావణ సంగీత ముఖరితములు
భవనములు భోగలాలసా భావనములు
హా వనములు రాగవిద్వేష వివరణములు.

మనములోని జిగీషయే పనులలో జి
ఘాంసగా అనుపదమ్మును కదనరంగ
మందు దూకిన యోద్ధ ప్రమాణచలన
జీవనుల కట సర్వ విశిష్ట పదము.

రాజ్య పరిపాలనా విమర్శనము నేర
మధిపతుల లోపమెంచుట అమితఘోర
మాత్మ వంచించుకొనియు రాజ్యాధినేత
బొగడుటయె ఎంతవారల కగతికమ్ము.

మమతయే న్యాయనిర్ణయమార్గ రీతి
సమత పైపైకి లో ననిశమ్ము భీతి
ప్రేయముల కెల్ల వేళల వెతకులాట
శ్రేయ మెల్లరకున్ చిట్టచివరి మాట.

రాగభోగాల కఁచట నీరాజనమ్ము
పరవిచారణ ధిక్కారభాజనమ్ము
తెగుట ద్రెంపుట లఁచట నుత్తేజనములు
పోరుపు పోడిగింపులే వీరభోజనములు.

మేనిసొబగులకై చేయరాని పనియు
కాని పను లెంచి చేయంగ లేనివియును
ధర్మమే కాదు సమహితకర్మ కాదు
వీరతగ మాన్య మచట ఆవేశమెల్ల.

తీరముగా భూమిపై తమతీరు మార
కుండ మనసెంచి సమ్మోహ కోపతాప
జాలముల నల్లి సుఖదుఃఖ సాగరమున
మునిగి తేలుదు రానందమని భ్రమించి.

రజని చరియింత్రు పగటినిద్రల భజించి
తగవులన్ నించుకొందురు పగల పెంచి
ఒకరి దుర్గతి నిజజనాభ్యుదయముగ భ్ర
మించి ద్వేషాగ్నులన్ రగిలించుకొంద్రు.

మేపు మరగిన జంతువు కాపు నోళ్ల
దన్య సంపాదితార్థము లాహరింప
ననువుగా ధర్మపన్నమ్ము లనువదింత్రు
దృక్పథము బట్టి ధర్మధర్మేతరములు.

రాజ పరిచారకుడు తాను రాజైనయైన
యట్లుగా సల్పు స్వేచ్ఛా విహారములను
మర్మమును వీడి మనసులో మాట చెప్ప
కొనగ జంకెడి పందలు వినయఘనులు.

మేదినీపతి తలపెట్టు నేదిగాని
యోచనము లేక సుష్ఠుగా నాచరింప
గలుగు మాన్యుల కే అట కార్యశూర
గణ్యత లభించు వారలే పుణ్యజనులు.

మదన సామ్రాజ్య పాలనా మహితకీర్తి
కోరి చిత్రము ! మదనారి గొలుచుచుంద్రు
రంభ గోరెడి సవనసంరంభ పతులు
పతుల చిత్తములకు నలవడిన సతులు.

నోములను చేసుతో అర్థకామముల భ
జించి పరమార్థమును గోరు స్త్రీజనమ్ము
తపము చేర దురంతమౌ తపన వేగి
విడుల మని పురుషులున్ విట్టివీగుచుంద్రు.

రమ్ము రమ్మను మాటలో రావణతకు
ఉలికి పడుచుండు నెంత మహోద్ధతియును
పొమ్ము పొమ్మన నేమి కాబోవు నోయ
టంచు సదరెడి నెంత మహానుభావమ్ము.

మేరుధీరుల ముంచెను వారిజాక్షి
సారమతియైన జారె సంసారమందు
శారములు చప్పవడెను బంగార మరసి
కోరమీసల వంచెను కుసుమశరము.

సరస సంగీత సాహిత్య సాధనములు
మోహారము వేడి నగ్గించు బోధనములు
కోమలాంగులు రాగలై గోలలైరి
గోలబడి పురుషసింహులు క్రూరులైరి.

హరుని భజియింత్రు భవతాపహరుని మరచి
శూలి గొలుతురు పశుపతి జాలి మాలి
ఈశు భావింతు రాత్మ వినాశమునకె
శంకరుని జూతు రక్షల నాశంకరునిగ.

స్త్రీశోషలు చందనచర్చ లేశు
కర్పణముసేల తమ దంభదర్ప మాత్మ
వర్గమందున శ్లాఘింపబడుట కొరకు
చేతలెల్లను పరుల వంచించు ప్రాప్తి.

నాదికాదని ఒహటెల్ల బూది నలము
కొని విభూతులు తమవనుకొనెడి జనుల
వల్లనైనట్టు పాండిత్రీ ప్రాభవమ్ము
[illegible] వైశిష్ట్య సూచకమ్ము.

మనమునంబడుమథన మన్మథుని బాధ
తనువు చెంచెడి తాపము ధనపిపాస
ఇంద్రియమ్ముల దాసులై ఇంద్రపదవి
కోరి యజియింతురట కర్మవీరులెల్ల.

తరగని కోర్కెలబడి చెడ
దిరుగుచు తిరిగిన కొలంది దినదినమునకున్
పెరిగెడి తాపత్రయమున
పర ధన దారాపహరణపరులై ధావ

తురంగంబు నెక్కి గమ్యం
బెరుగని సురపాయి బ్రతుకు తెంపుల తపనన్
మరుభూముల మృగతృష్ణల
చరియించుచు నుండు నష్టసర్వస్వంబై.

లలితలలితమ్ము మోక్షకల్పమ్ము నైన
జీవనాలాపముం దెక్కి జీరవోయి
శ్రుతులుసెడి రాగతాళ సద్గతులు దప్పి
వేదనల రోదనము సేయు విరసు డగుచు.

రాజమార్గము విడచి దూరాల కొంత
నునువు బ్రమపడి స్వర్గమున్ తనువుసంతె
పొందగోరుచు సమయసంస్కరణ బూని
జీవ ఘమసించు నిప్పు మనసీమలందు.

మదిని దలచెడిదొక్కటి మాటయొకటి
చేతవేరొండుగా శ్రుతిచెడిన పాట
యయ్యె జీవన మాత్మసంయమము లేని
బ్రతు కశాస్త్రీయమై దుఃఖభాజనమ్ము.

నాతి యను పేరె ధ్వనియింప 'న అతి' యని
గోతి నొనరించి మూఢులై గోతబడిరి
పతిని గొల్చెను సతి జగత్పతిని మరచి
యాంత్రికమ్మగు కర్మ అనర్థమయ్యె.

మనన కనువగు మనమున మమతపండె
హవనదీక్షలు సవనాగ్నులందు మండె
లోని చీకట్ల మార్గము కానరాని
వారు రాత్రించరుల్ పట్టపగలుకూడ.

పశుల మనుకొందు రాశావివశత సురిగి
దొడ్డలుగ జెల్లుచుందురు గడ్డిమరగి
పలుకు మాటలలోనె; లోపలుకు లేదు
కులుకులెల్ల నెపందలో నులికిపాటు.

రాజ్యముల గెల్చి రాత్మసామ్రాజ్యమోడి
గెలుపు తలపున నరమ్ము కలతపెట్ట
గెలుపులో నోటమిని పొడుకొల్పుకొంద్రు
గెలుపు నోటమి గెలిచిన గెలుపె గెలుపు.

నరము నరము సాగనారతో చేనిన
పలువుకాగ దేహబంధనముల
పెంచుకొని బిగింపు బిగిసిన కొలదిని
బలమటంచు పగలబడుచు నుంద్రదు.

నేను బ్రహ్మనన్న నిగమార్థ మన్వయ
దోషమున విరాగదూర మయ్యె
తత్త్వమసి యటన్న దర్శనమే తమో
దృక్పథమున బ్రతుకుకుటిపుల బెంచె.

ఓంనమశ్శివాయ ఓం నమో భగవతే
శూలినే శ్మశానపాలినే న
మో మహేశ్వరాయ కామసంహారిణే
భవహరాయ భక్తబాంధవాయ.

నగజ మానసాధి నాయకా భుజగభూ
షణ ఉమామహేశ సాంబమూర్తి
పశుపతీ గిరీశ ప్రమథాధి నాథ చి
ద్భాసమాన ఖండపరశు శర్వ!

మదన విజేతా మోక్ష
ప్రదాయకా రుద్రభూమివాసా ఈశా
విడచి త్వదన ద్రూపా
విన్నాంవరా వేదసార ద్వేషవిదూరా!

శివ భవ అభవ భవోద్భవ
సవనధ్వంసీ వృషధ్వజా (శ్రీ) కంఠా
అవినాశా నాశంకర
అవేద్య విదితసర్వ శంకరా త్రిపురారీ !

వాచామగోచరా ! ఈ
శా!చిద్ఘన కృత్తివాస హరహర శంభో !
ప్రాచీనార్వాచీన స
మీచీనా! కాలకాల మృత్యుభయహరా !

యమనియమ ధ్యానాదుల
శమదమ సంపత్తిచే ప్రసన్నతనున్ రా
ద్రమునను సంపుటి నీ రూ
పముగా దెలియంగనగు శివా ! భూతేశా !

పంచాక్షరి జపియింతును
పంచీకరణమ్ము వల్లెవేతురు యజ్వల్
కాంచన గోపుర మణిసము
దంచిత మంచోపవిష్టులై హర్మ్యములన్.

కోరికలు తీర తపముల
పారము ముట్టెదరు గాని పారముగనరా
కోరికలను తమపని సమ
కూరగ నట పొత్తులేని కూళల్ చేతల్.

ఆవిధముగ లంకాపురి
చేనపడిన శౌరి చింతచెచ్చై యుండెన్
జీవనమునోసి తీర్చంగ
పావని మునుచనిన యోగపథముల నరిగెన్.

ఆసురపురము జొరగనగు సవ్యముగనని
ఎదిరి నెక్కిమీద నిడెనవంగ
ఎడమకాలు మోపి ఎత్తైన ప్రాకార
లంఘనమ్మొనర్చె లాఘవముగ.

వెలుగుచుండె దీపముల తళ్తళ్ల లం
కాపురమున తప్త కాంచనమ్ము
ద్వారమందు పసిడి తోరణములును సో
పానపంక్తి కూడ స్వర్ణమయమె.

వనితలే కాక పురుషులున్ స్వర్ణకంక
ణముల హారాల తోడాల నమితమైన
శ్రద్ధతో దాల్చి కేశముల్ సర్దుకొనుచు
తిరుగుచుందురు సొంగులొమురులవోలె!

ఎట్టుకొనిపోదు రనుభీతి ఏణనయన
లెంత అవసరమున్నను గృహమువీడి
పురుష సాహాయ్యమునగాని పోవ సాహ
సింప రెట్టకేని; లంక నాసింపు భీతి.

వైభవమ్ముస లేదాత్మశోభ యచట
కలిమి కచ్చట సంతృప్తి చెలిమి లేదు
చదువులకు లేదు వినయసంసర్గ మచట
మనుతయే చెల్లుచుండెను మానవతగ.

ఇంటింట వేదఘోషయె
అంటందగనట్టి వేల్పు నారాధనయే
తుంటరితనమున దేహము
బంట్లై తన సుఖముగోరు పసుగులు బరగెన్.

జనకరాజర్షి తనయ నిచ్చటకు దెచ్చు
నంతఘనుడట యీ లంక కధిపతియట
వల్లెవైచిన వేదాలవల్ల మూఢ
దానవులు తెలియజాలిన ధర్మమింతె.

దేహమే సర్వముగ నెంచి తీరనట్టి
కోరికలు తీరునని తీపు తీపు తరము
లాచరించుచు వైదేహి నందగోరు
కర్మజడులకు నైగమధర్మ మింతె.

చూడముచ్చట గొల్పెడి, వాడ వాడ
రమ్య హార్మ్యములే, పాలరాతిపైన
తాపడమ్ములైన బంగారు గోపురములె
అడుగు నడుగున విశ్వేశు నాలయములె,

వేదశాస్త్రాల బోధన విధినిషేధ
పూర్వకము మాత్రమై నటుబూడ్చి పెట్టు
తంతుగా మారె నదె వేదధర్మమనెడి
దనుజు శిక్షించు టుత్తమ మనుజపథము.

భోగి కెట్టుల నై దేహి యోగమబ్బు!
త్యాగధనుడైన సాకార ధర్మమూర్తి
కెదిరిగానిల్చి గెల్చునే యిట్టి స్వర్గ
కాముడై యాగములు సల్పు కర్మజడుండు!

ఇతడు పల్లించు వేదాలు, నితడు చేయు
పూజలే పాడుపడినట్టి బొందినూత
పూడ్చె నీతని ఇట్టి సమ్మోహితాత్ము
డెట్లు సంసారసాగర మీదగలడు!

ఇంద్రియమ్ముల పట్వాలెత్తించి గుర్ర
ములకు కళ్ళెము వేయక కలయదిరిగి
చిత్తమున తాను విశ్వవిజేతనంచు
తలచి చిత్తుగ నోడిన దానవుండు.

పదివిధముల తలపులతో
పదితలలా యితనికనగ పండితమన్యం
మెదనిండిన పిడివాద
మ్మదె వేదము తాను వేత్త యనుకొనుచుండున్.

లోకమ్ముల గెల్చియు లో
లోకమ్మున నోడి స్వర్గలోకమ్మునకై
నాకారి ప్రముఖ సురా
నీకము లోగొనె నియంత్ర నిర్వచనములన్.

వనము జెరిపించి యట నుపవనము బెంచి
యాశ్రమము లయ్యెనట ననాథాశ్రమములు
విద్యగా జెల్లె నట వృత్తివిద్య యొకటె
రావణప్రవచనంబయ్యె బ్రహ్మవిద్య.

ఆచరణలేని మాటలేయయ్యె మంత్ర
సముదితపంథము వర్జ్యము నయ్యె కర్మ,
రాగమే నాగ లేదనురాగమెపుడు
భోగములె సాగుచుండె విరాగములుగ.

తెలివితక్కువవారికి తెలుపవచ్చు
తెలియ ననుకొన్నవారల తెలివిలేమి
రావణుడునె ఎంతటి బ్రహ్మవేత్త!
నేర్పు సులభము నేర్పుల మార్పుకన్న.

దివ్యదృష్టిని బడక మస్థితి సమగ్ర
ముగను దర్శించె మారుతి, భూతపంచ
కమున కష్టాంగముగ మ్రొక్కి కడలి గడచె
తటముగా నిట్టు సన్మతి వేడుకొనియె.

భూతపంచకమ్ము చేతనా స్ఫూర్తిచే
కూర్చుకొనిన భువిని తీర్చలేని
బాధ లేదు; సాయపడునట్లు భూతాల
దిద్దుకొనెడి చూపె దివ్యదృష్టి.

సీమితమ్మైన తనువు నిస్సీమసీమ
లందు పయనించు దివ్యత్వ మందినపుడు
భావశక్తి మహేంద్రపర్వతము నంత
అల్లె యావంత యగును దేహమ్ము లెల్ల.

భువిని గలిగెడి శక్తి సంపూర్ణ, మందు
పూర్ణమును దీయ మిగుల సంపూర్ణ, మేమి
కలిపినన్ దీసివైచినగాని పెరుగ
కల్లె తరుగదు, శక్తికి హద్దులేదు.

చేతులుంగాళ్ళు సత్కర్మ చేయుకొరకు
క్రిసలతోనె భవాబ్ధి లంఘింపనగును
భావనముచేత దేహము భవ్యమగును
తీర్చదిద్దిన భావము దివ్యమగును.

అంతనే మహేంద్ర ధరణీధరమ్ముగా
ఉదధి లంఘనమున కూతచేసి
గరుడువోలె నెగిరె ఘర్మజలమ్ముల
చదలపై కలాపిజల్లుకొనుచు.

గుహల దాగియుండు క్రోధమోహావేశ
క్రూరవితతి వెలికిబారె, సూర్య
చంద్రులుభయులొక్క సమయాన వెల్గిన
తీరుదోచె నేత్రదీప్తి యందు.

విరిసిన తలలూగాచిన యా
తరువులు పూవులను గురిసె తనువున పులకల్
విరిసిన నవ్వవలె ధరణీ
ధర మనిలాత్మజుని పెంపుదలపున మురిసెన్.

నడుము సన్నముచేసెను, ముడిచె కాళ్ళు
మెడను బిగబట్టె, లోని సందడి నడంచె
పూనె భుజము మహాత్కార్యమున కనంగ
ఆయమించెను ప్రాణములైదు నొకట.

కలుగుశక్తి కుంభగట్టి, ఊర్ధ్వముఖమ్ము
చేసి దృష్టి, రాము చిత్తమందు
నిలిపి సహాచరులకు బలికె నే దూసుకు
పోదు రామబాణమువలె ననుచు.

భువినిగాలించెదన్, వసుపోతవోసి,
ఈడ్చుకొనివచ్చి రావణు నినకులాబ్ధి
చంద్రు ప్రొక్కించినప్పుడు సార్థకుడను
పావనుడ రామచంద్రుని సేవకుడను.

లంక పెళ్ళగించి రావణు బంధించి
అమ్మవగపు బాపినపుడు కాదె
ఇన్ని వ్యాకరణముల నింతటి సాముగా
నమ్మ నేర్చిన ఫలితమ్ము జగతి !

పవన వేగుడైన పావని పెన్నంటి
పరువు బరువు గలుగు తరువులు హిత
వర్గమట్లు హనుమ బంపగా నేగెను
వేగముడుగ పడియె సాగరమున.

ఐదుతలల పాములాయన చేతుల
నాకసమున నీదునట్లు, దూయ
బడిన బాణమట్లు, వడియింతమని చెప్ప
తరముగాని రీతి తరలె హనుమ.

ఆకసము నె మ్రింగునా ! భవసాగర
మాచమనము చేయునా ! యనంగ
సహచరులకు దోచె శాంతగంభీర భీ
కరమునౌ ప్రశస్త కార్యసరణి.

పవనసుతుని దీక్ష జవసత్త్వల కెంతొ
సంతసించి దేహశాంతి నీయ
లోనదాగియున్న మైనాకు నర్థించె
సాగరుండు వినయసాగరుండు.

సుంత సేదదీరి యంతట పయనింపు
మనెడి దేహధర్మమునకు కార్య
దీక్షితుండు తెలివితేటల జోడించి
సాగిపోయె పవనవేగు డగుచు.

అలుపు తీర్చుకొనగ వలసిన యవసర
మెంతో తెలుపగా పరేంగితమ్ము
ఎరుగు పవనసూను డేమాత్ర మొల్లడు
అలుపు నెంచునే ప్రయత్నశీలి!

నాగమాత సురస నాజెల్లు రససిద్ధ
ఆకసమ్మునంత యైన నోట
మ్రింగదలచి మీదిమీదికి వచ్చిన
హనుమ అణువునంత యగుచు దూరె.

మూతపడకముందె ఆతండు చల్లగా
నోటినుండి తిరిగి బైటపడియె
లక్ష్యశుద్ధియున్న లాక్షణికులు పర
మార్థమును త్యజింప రన్యములకు.

తోడు వీడకుండ నీడగా సింహిక
అనెడి భూత మెప్పు డడ్డుపడును
జాగ్రతను వహింప సుగ్రీవు నుపదేశ
మెంచి పవనసూను డేగెముందు.

శ్రమల కోరిచి దేహవిశ్రాంతి మరచి
వలదటన్నను వెన్నంటు వగపు నడచి
ముందునకు నేగు వ్యవసాయ బుద్ధిమైన
పావనికి జోతలర్పించె ప్రాజ్ఞకోటి.

లోకము మురిసెను నిర్జర
లోకమ్మాశీర్వదించె రుద్రాంశజనిన్
ఆ కపివర్యుని కర్మ వి
వేకము దాటించు నెంత విపదంబునిధుల్.



# రెండవ సర్గము

మారుతినిన్ శక్తిసుధా
సారమతిని రామతత్వ సంవిద్ధృతినిన్
ధీరుని భజియింతు మహో
వీరుని ఆద్యంత మెఱుగు విదుషాంవరునిన్.

ఎవఁడు నవ వ్యాకరణ
ప్రవీణుఁడయ్యు పరమమైన అర్థము దెలియన్
శివ మనుభవమున గాంచెనో
భవబంధము బాసి, అట్టి పావని దలతున్.

రాముని చెంతనె మసలియు
రాము బడయ లేక వెడలి రావణలంకన్
బాములబడు భూజాతన్
రాముని గనె నతని 'అంతరంగము' నెంతున్.

లంకాదహనము చేయక
లెంకయు సీతమ్మ బడయ లేడు, భవాబ్ధిన్
శంకాత్ములు లంఘింపరు
వంకరబుద్ధియును రామబడయును వశిరై.

సీతాన్వేషణ మాతని
చేతల పరమార్థమంచు చింతింపను సం
ప్రీతిగ సుగుణారాముని
సీతాప్రముఖముగ వెతుక జేరెను లంకన్.

అట సీతగనగ నాతని
కటకట సామాన్యమతికి గ్రాహ్యంబగునే
'ఇట' కా 'దీమెయు' కాదని
ఎట నెందరిగాంచి పరిహరించెనో తెలియన్ !

కోతియని దార్శనికులున్
ప్రీతిగ సుందరుని బిల్వ నెడగులు వల్లే
కోతియని తమ్ము బోలిన
కోతియె యంచేహొయోహొ కూసిరి కూతల్.

పావని మర్కటమగుచో
నేవ్వాడిక మనుజుడౌనో ఎవడజుడగునో
సేవింపు కోతిసైనను
పావనిగా మారు రామభద్రుని చెలిమిన్!

హనుమా నేనుం గోతిని
కనుము ఒకకంట [illegible] గాంచి వివంత్
తనువు నొకదారి [illegible] మును
చనె నను వది వర్ష [illegible] నిశాచరవృత్తిన్.

* * *

అనవద్యుం డనుగమ్యుడు
మనోజవుడు మానవప్రమాణుడు [illegible] వం
బును దాల్చియెడద తానై
తనుమనముల కృపిని నల్పు ధార్మికుడంతన్.

లంక చేరుకొనియె లంఘనమున సాయ
పడిన సాగరునకు నెడద మ్రొక్కె-
ధర్మసారమహా కృతజ్ఞత సాకార
మైన వినయఘనుడు జ్ఞానమూర్తి!

నాకపురము దెచ్చి నాటిరా నాగ భూ
లోకవాసులకు ప్రలుబ్ధనేత్ర
పర్వముగ త్రికూట పర్వతమున భవ
జలధి మధ్య లంక వెలుగుచుండె.

ఎపుడు రామచంద్రు డెత్తివచ్చునో ధర్మ
పత్నికై అటన్న భయముమీర
సకలభయదమహా నిశాచరబృందము
లంక గావ మంచె రావణుంపు.

పుణ్యజనుల ముందె భూజాత వెదుకంగ
సాధ్యమగునె! వారి సాధ్వి నెందు
కన్నుగప్పి చోరకయున్న రానిచ్చునా
తత్క్షణమ్ము సేయు రాక్షసాళి !

వేగ యగునుగాక సాయంతనంబైన
విడువకాని వెదకు నదను కాదు
అపుడు వేమ బ్రతిపవత్తిథిలో వృప్తైనో
యనగ దోచె చంద్రు డాకసమున.

పట్టణమ్ము చుట్టు ప్రాకారములు దేహి
నింద్రియముల వోలె ఎల్లవేళ
కాచుచుండు, లంకకాపగు లంకిణి
ఆజ్ఞలేక చీమయైన జొరదు.

మిత్తివోలెదూకి మ్రింగగా, ప్రతిఘాత
యయ్యె తుల్యశక్తి యగుట హనుమ
అంత ప్రాణశక్తి ఆయమ పూర్వాను
భవము తెలియ లేని శివముజవము.

అంతనామె వినతయై స్వస్తి వచియించె
జానకిని గనంగ జాలెదవని
తగుదు వీవొకండె దశకంఠు ద్రుంప; నీ
తమ్మ జాడ ప్రకటనమ్ము సేయ.

శాపతప్త నేను, శక్తి స్వరూపుడా
వాసరుండు దరికివచ్చి నిన్ను
నుద్ధరించు ననుచు ఉత్కృష్టసాంగత్య
మహిమ దెలిపె ధాత మనుజవీర !

జగమదెల్ల దుష్టసాంగత్య దోషాన
భోగలాలసతకు వీగిపోవు
పొమ్ము పావనీ ! శుభోదర్కమే యగు
అడ్డులేని వాక్కు; ఆగు నీకు

అనిన మహాత్మమూర్తి కంజనీసుతుడంత
అంజలించి ముందుకరిగి చూచె
ఏడు నెన్నడైన ఎత్తునంతస్థుల
మిన్ను నంటుచున్న మేడవాడ.

ఏడ నుపవనమ్ములే, మధుపాయి బం
భరము పూలచుట్టు తిరుగుచుండె
కొంగుదాకు కోర్కె కోమలి వెన్నంటి
ఈలవైచు చెనటివోలె నుండె.

ఎంత వలపెయైన ఇంతటి రావణా
ర్భాటమును సహింతురా పడతులు!
పడదు నాతికిట్టి బలవంతపు బ్రాహ్మ
ణార్థమనగ ముడిచె అబ్జ మొగము.

చిత్రవర్ణ గంధ సీమాపధుల పూల,
సారసాన్వితమ్ము నీరమ్మాని
మదిని పొంగికూడ మందమందమ్ముగు
పవనలుగ వాలి పిచుచుండె.

భూతపంచకమ్ము భీతిమైకర్కశ
వియతి నెంచి లొంగె నీరసపడి
ఈహ లెల్ల సాంద్రమోహానుభవ భవ
జలధి మున్గి తేలజాల వయ్యె.

 

ఇతడు సీత నిచటనే యుంచెనా ! ఆమె
బ్రతికి యున్నదా ! వివరము తెలుగ
వర్తమాన రూప వర్తనముల కాని
అనుచు కార్యసరణి నాత్మదలచి

పనులు చూడకుంత పనిజూచు భావనా
నుగుణమైన చర్య తగినదిపుడు
జగము తెలుపగలుగు షడ్దర్శనమ్ములు
యుక్తమిపుడు సూక్ష్మయోగ మొకటె.

అణువుకంటె కూడ నణువుగా దృశ్యస
త్యముల, యోగమున మహామహిష్ఠ
భావ్య సత్యములను ప్రాజ్ఞుండు తెలియగా
నగు నతంద్రు ద్రష్టలైన విదులు.

అనుచు కన్నుబర పె నాకసమందున
ఇన్నియుగము లిందు నేమి వెతుక
తిరుగుచున్నవాడో తెలియగనౌనె యె
వ్వియినిగాని సృష్టి వెతుకులాట !

ద్రష్టలైన వారి దూరదూరాలలో
మినుకుమినుకు మనగ నునిచి చదల
సకలజీవహృదయ సామ్రాజ్యముల నేలు
చల్లనయ్య చంద్రు జాలునేనగు ?

ఎవ్వడెన్నిమచ్చ లెన్నిన వహియించు
డాగ్రహమ్ముపడ డనుగ్రహించు
పలువిధాల దూషణలు భూషణలు రాజు
సరకుసేయునే ప్రసన్నమూర్తి !

ఒరుగుతరుగు లెంచి ఉలికిపడం జన
దగదటంచు నాత్మగతిని తెలుపు
పక్షపక్షమున విభావరి నిండియు
తొలగుచుండు భువిని వెలుగు నింపు.

మదిని కలచు నొకయమావాస్య; వెంటనే
శోకమడచు చంద్రరేఖ ప్రథమ
దివసమందె పొడిచి, దిగులుతో క్షీణింప
జనదు శుక్లపక్ష చంద్రు నెంచి.

విరహి లోని దుఃఖభరమున వడగాడ్పు
వీచునట్లు లెంచు వెన్నెలలను
చూపుబట్టి యుండు సుఖదుఃఖములు చంద్రు
డేమిసేయు సూర్యుడేమిచేయు!

మదిని సుధలు పంచు టదియే మహాదశ
దిగులు, వగపుసెగలు దగని పీడ
చలువ లీనువాని చంద్రమహాదశ
నిలచు గ్రహము లెంత నీచమయ్యు.

భాస్కరుండు లోకబాంధవు డయ్యును
కాల్చుచుండు కాలకాలు వోలె
తాను తప్పుడయ్యు తనియించు జ్యోత్స్నా ప్ర
సన్నుడైన రాజె ఉన్నతుండు !

తిండిపోతులైన దేవత లెంతగా
మెక్కుచుండ్రో మనసు కక్కురితిని
ఉన్నదానితోనె ఓషధీశుండున్న,
లేని వారి కెంచు తాను తరిగి.

పగలు తగవుల న్నివారించి తనరాజ్య
మందు పొత్తుగూర్చు అలకదీర్చ
కలువ ముడుచుకొనిన గని ఉపేక్షించు ఆ
భాస్కరుండు లోకబాంధవుండె !

రావణుండు తన్ను లంకలో బంధించె
నా యనంగ పదియునారు కళల
సరస నృత్య గాన సాహితీ సౌధమ్ము
లందు తిష్ఠవైచు చందమామ.

ఎవని భావ మెట్టిదే యగుగాక ప
ట్టించుకొనక అదియు పెంచు భావు
కుండు; దుఃఖ తాప కోపాభివృద్ధికి
అడ్డె ఆత్మశాంతి కండదండ.

మనసునందు పుట్టు మన్మథు డనుజుండె
యగుట సోదరునకు అండయయ్యె
కామకామినులు ఆ మహీస్థలి శాంతి
తోడుపుట్టువులకు దోపిడయ్యె.

అచటి కన్యకలు అనంగుని కంగాలు
అచటి యువతులెల్ల అప్సరసలు
అచటి ప్రౌఢవనిత లారని మంటలు
వెతల ముదుత లచటి వృద్ధజనము.

విప్రవీరు డాత్మవిశ్వాసముగ చెల్లె
కలిమికొలది అచటి గౌరవమ్ము
అంబభక్తి కొలత ఆడంబరముతోడి
కొలుపులయ్యె; విలువ మలుపుదిరిగె

మదనార్తియై ఒక్క మదవతి రాగస
ల్లాపమ్ము సల్పు విలాపగతిని
పగదీర్చుకొనలేమి సెగ కోర్చియున్ చేత
బడి చేయు నొక్క కాపాలికుండు
గోముఖమ్మున సుందరీమణితో సాధు
భాషణ యత్నించు వ్యాఘ్రశీలి
పాదరక్షల అర్ధభాగము వీడి మం
దిర బహిస్థితు డార్తిదీర్చ వేడు.

నటన నేర్చిరి ఆ మహానటుని గొల్చి
హృదయరాగము నలదిరి పెదవులంటె
ఈజగమ్మున నెవరైన ఇంతెయింతె
అనుకొనుచు సాటివారల కనుచునుంద్రు.

ఎవ రెంత అపచార మెట్లాచరించిరో
తెలుపు పే దనుజుల తెలివి తేట
నిగమముల్ పరదోష నిర్ణయ సామర్థ్య
మునకునై వల్లింతు రనపరతము
తమలోని లోపముల్ దాచుకొనంగ ఆ
తలకట్టు, బొట్టు, ప్రధానమంత్రు
మదిలోని కలత ముమ్మరముగా మననాది
సాధనముల ప్రదర్శనము చేయ

రాటవికమైన కోర్కెల నంతరంగ
మందు నిల్పియు నాటక మాడుచుంద్రు
త్యాగ వైశిష్ట్యమున్ చెల్వు భోగపరులు
వివిధ ధర్మాల బోధించు వృత్తిపరులు.

చేతమున బుట్టు చిత్ర విచిత్ర భావ
ములకు తీరుండునో ! లేక తలపు కలయ
దిరుగుచుండునో తనుదాని తెలియనగును
ఉన్నపనియేమి ! అప్పటి ఊహలేమి !

అచట సీతమ్మ వెదుకగా నతడు వచ్చె
ఎవతె ఆయమ కాదొ గ్రహింపలేని
యంత కృత్రిమ మచట ప్రత్యక్షమయ్యె
ఏన వెసుగంగ తెలియనొ కాని దెదియొ.

ఉన్న దున్నయట్లు కన్నది కన్నయ
ట్లుండు నొక్కొ సత్యమూర్ధ్వదృష్టి
కాచ్చ సత్యలేశ మందునేమొ ! పర
మార్థ మెసుగు టనిన అనుభవమ్మె.

భోగమ్ములకు పండ్లుపులిసిన మైథిలి
కీయల్ప భోగమ్మె లబ్బురములె !
గడ్డిపోచగ రాజ్యకాంతను వీడిన
పురుషుని పత్ని కీపొలుపు బులుపె !
కానకు దీక్షమై కదలిన దీక్షితు
నర్ధాంగి మెచ్చునే అదిరిపాటు
ఆత్మశిక్షణ మార్గమైనట్టి వాకి కా
శాపాతకుల దృష్టి సరసమగునె !

వెతకుటకు వచ్చితిని కాన వెతుకవలయు
నంతియేకాని యిచట సీతమ్మ ఉండ
దన్నమాటయె నిత్యసత్యమ్మ; కాక
అన్ని వెతకుటయాగును భవానుభవమ్ము!

ఆ పర్ణశాలలో అన్నేండ్లు సుఖపడి
ఈ తళత్తళలతో నెట్లువేగు !
ఆశాంత విశ్రాంతమా నాశ్రమమ్ముల
నుండి యీ యార్భాట మోర్చు టెట్లు !
త్యాగమ్ములో నిత్యభోగమ్ము చవిజూచి
ఈ యనిత్యమ్ముల నెట్లుమెచ్చు !
పొంగుక్రుంగు లేని పురుషుని సేవించి
ఆవేశములకు మారాడునెట్లు !

శాంత గంభీర మౌన విచారముద్ర
నిచట ఏ కడగండ్లకు ఎంత దుఃఖ
పడుచు సున్నదో ! మాయలో పడితి; ఆ య
మాయకుని దించి ముంచితినా యటంచు.

ఋతు ధర్మముం దప్పి ఏణాక్షులనుగూడి
క్రీడించు నిట సౌఖ్య మెంత భ్రాంతి !
బితుకు బితుకు చచ్చుబ్రతుకుల నీడ్చెడి
వారి చిత్తముల నేపాటి శాంతి !
విద్యున్నిభమ్ముగా వెల్గు దీపాల లో
నెద దాగు చీకట్లదేమి కాంతి !
ఒక్కింత విశ్రాంతి కక్కట ! పాంథుల
కే విలులేని అదే భవంతి !

అన్ని యున్నట్లుగా తోచు అజ్ఞులకును
ప్రాజ్ఞు లెన్నెడి ప్రముఖ లోపము ప్రశాంతి
పదము నర్థమునకు పాటుపడెడివారు
పరమహా నర్థ మెట్టుల బడయగలరు !

ఆ విధముగ చింతించుచు
పావని లోగుట్టు దెలియ పరిశోధించెన్
ఏవేని గుట్టుమట్టులు
వివేచనముననె లోలో వెలుగుల నించున్



# రెండవ సర్గము

అందములగాంచు నేత్రము
అందలి పరమార్థ మెఱుగ నన్వేషించున్
డెందం, బీ విధమున ఆ
యందములకు అందమిడున దాత్మగ దెలియున్.

దృశ్యమ్మరయును నేత్ర మ
దృశ్యమ్ముల నెఱుగు దూరదృష్టి, ఉభయ మ్మా
వశ్యకమే ఎరుకకు; ఈ
దృశ్యము ద్రష్టయును ఒక్కటే సత్యమునన్.

ఉన్నదెల్ల సత్తు; ఊహ్యమ్ము చిత్తును
తనను దాను తెలియుదనము ఎఱుక
అన్ని తానెయైన అనుభవ మానంద
మద్ది వాగతీతమా సమాధి.

ఆ సమాధినున్న హనుమ తోచెను జీవ
నాటవిం జరించునట్టి సింహ
నుట్టు; లాలమంద నాబోతునట్టులు
చదల తారలందు చంద్రునట్లు.

ఆకసమ్ము వోలె నగుపించె నాతండు
కనులు సూర్యచంద్రులన వెలింగ
తనువు పులకరించె, తారలతో మిన్కు
మిన్కు మనుచు వెలయు మిన్నువోలె!

ఎవనిజూడ వాడె యిహబంధముల జిక్కి
మంటినంటి నడచు కుంటుకొనుచు
హనుమ నేలనుండి ఆకాశమున నీదు
చున్నయట్లు తోచె నున్నతముగ.

నగరమందు కాలినడకను సాగెను
రమ్యహర్మ్యరాజ రాజవీథి
స్వస్తికాకృతిని, ప్రశస్త పద్మమ్ముల
రూపు జూపె సౌధగోపురముల.

ఒకభవంతినుండి యొక్కొక్క రాగ తా
ళమున నొదిగిన సరిగమలు వారె
నృత్య నిపుణలైన ఏణనయనల లయ
కలరి మువ్వలు గలగలల మొరసె.

స్వస్తివచన రావణస్తుతిగా, వేద
ఘోష ఘన జటాబ్ధి ఘూర్ణితమ్ము
పండితులును కర్ణకుండల వేదార్థ
వాద వాచనా వివాద చణులు.

మించు లంక నిలచి యంచల నడకల
లలిత సుందరదన లాస్యమయ్యె
అంది యందనట్టి అందాల నాశించు
వారి కవియ ప్రాణపాశ మయ్యె.

పూపుబోండ్ల పొందు పోరాటమున గెల్వ
నోయనంగ మదన సాయకముల
బూని యెత్తివచ్చు పురుషవాహిని వార
నాశ్వ వాహన చతురంగ మగుచు.

ప్రత్యంగ సౌష్ఠవ ప్రాభవస్పర్థా ప్ర
దర్శనోత్సుకలౌ నితంబినులును,
ప్రాణాంతకమ్మైన పరిపరి క్రీడామ
హోత్సవమ్ములఁదేలు యువజనులును
ద్వేషాగ్ని రగిలించు వివిధ విద్యా ప్రాగ్వ
వాదప్రచండులౌ పండితులును
అష్టసిద్ధులలోన అల్పమ్ముతో తానె
దైవమ్ముగా చాలు దాంభికులును.

ఎచటగాంచిన భజనలు, ఎచట నేని
పూజలున్, పూనకమ్ములు, భూరిలోభ
తర్పణములైన విప్ర సంతర్పణములు
దంభదర్ప ప్రదర్శన జృంభణములు.

ఎరిగి వర్తనమ్ము హరిణాంకవదనగా
నెన్న ప్రియుడు మొగము చిన్నవోయి
అలిగి ముడుచుకొనిన అర్ధాంగి అలకల
దువ్వ సుముఖి పెదవి నవ్వుతోచె.

వాడి నలిగి తొలుతపోడిమి వీడిన
పూల నాశ్రయించె ముసలితనము
ఊది పారవేయ నూపిరిపోయిన
గాత్రమట్లు పానపాత్రలుండె.

ఈ జగమ్మునందు నేపోడిమిం గన్న
రాగముప్పతిల్లి భోగవాంఛ
అతిశయించు కాని మతిమంతుడా కోర్కె
నాగు సుఖ మనిత్యమని యెరింగి.

రాగమున్న నె అనురాగమ్ము, దాననే
భోగ మదియ సతము సాగ, దసలు
బాగు దెలిసికొన విరాగము చొప్పడు
దాన ముక్తిబడయు మానవుండు.

రాగ మొకడె అచట తీగలుసాగెనా
భోగవతులు మంత్రముగ్ధభుజగ
వనితలట్టు లల్లుకొని రనంగుని సంగ
రమున నలసి వీగిరా యనంగ.

ఒకతె పలవరించె 'ఓ ప్రియా! ననువీడి
చనకు' మంచు ఆమె సరస జేరి
ఆశ్వసించె నొక్క యాసవమత్త యా
కోమలాంగి 'పొందుగూర్తు' ననుచు.

రాజవీథి నొకట రావణు నంతఃపు
రము కుబేరు మందిరమ్ము చైత్ర
రథమునందు వోలె రాజిల్లె నుపవన
మధ్యమందు మయుని మహిమ యనగ.

చలువరాతిలోని తెలుపుతేటల జగా
నిగలు నిండి గగన నీలఫలక
మందు వెలయు రాజహంసగా నా మంది
రమ్ము బహుళ రత్నరాజితమ్ము.

లోని కరిగి చూడ చావ యొక్కొక్కర్తు
పూలదండవలె, విశాల పద్మ
నేత్ర, పద్మపాద, నీరజపాణి, అం
దాల పూల స్త్రీలదండవోలె !

అచటి పద్మముఖుల ఆసవాకర్షణ
మూఁగె నలికులమ్మునాఁగ నుండె
బొమలు; పుష్పధన్వి పూనిన ధనువులు
వారిచూపు లతను బాణములును.

భేరిగ్రుమ్మె కఠిన పీనస్తని యొకర్తు,
తాల్చి బాహువుల మృదంగ మొకర్తు,
ఒకట మోవిదాల్చి యూదెడి వేణువు
వ్రేళ్లనుంచి మ్రోఁగ సంగనాళి.

జారెడి పమిటలుసున్, తెగ
బారెడు వెంట్రుకల చిక్కువడిన సరమ్ముల్
తీరిన కోర్కెల కాహా
కారములన నిక్కినీల్గు కఠిన స్తనముల్.

ఒకతె రంభోరువుల పైన నుంచి శిరము
కచభరమ్మును తలగడగా నొకర్తు
పీనవక్షోజముల దిండుగా నొకర్తు
పడుగు పేకగ తూగిరి పడతులెల్ల.

అచట నెవ్వతె మెడలోని హారమేదొ
ఎవరి వక్షోజముల గప్పు నెవరిపైట
కొంగులో! తెలియరాకుండ నంగనాళి
అల్లిబిల్లిగ లతలట్లు అల్లుకొనిరి.

హారములో మణిపూసగ
తారల మధ్యమున పూర్ణచంద్రునివలె జ్యో
త్స్నా రేఖాచిత్రమునా
నారీమణి గాంచి పవననందను డంతన్.

ఆమెయె జనకాత్మజ కా
నోపుననెడి భావమున మహోత్సాహమునన్
చేపట్టి నేలగొట్టెన్
జాపినవాలమ్ము సిద్ధిసంరంభమునన్.

కనులు మూసికొనియె, కైమోడ్చి కృతకృత్యు
డననిపొంగె, కాని జనకతనయ
పరునియింట నీచవై భవార్భాటము
నందు నిబ్బరముగ నట్టులున్నె !

అనెడి సందియమున నామెయే యైనచో
పతివియోగ దుఃఖవహ్ని వగల
సెగల పొగల దిశలజిమ్మెడి దాలిగా
కుములకుండునెట్లు ? విమలగాత్రి !

పొరవడితి నటన్న పరితాపమున వసి
వాడి వన్నెదరిగి వదనపద్మ
మార్తి నెదురుచూడదా దినమణివంశ
తిలకు గనులజూచు దినముకొరకు !

పానశాలలోన దానట్లు భూజాత
జాడ వెతుకదగునె ! ఏడనైన
స్త్రీలలోనగాక చెట్టుచేమల నవ
నిజ నిజమ్ము తెలియునే యటంచు

మనసు నచ్చజెప్పుకొనియు ఈ పంకజ
నేత్రలన్ వివస్త్రగాత్రుల నిట
చూచికూడ మనము సుంతయు బెసకని
కతన "ధన్యుడనని, ప్రతికితినని".

ముందుకరిగి తెల్లమొయిలునా నగరుధూ
పములమధ్య మంటపముసుబోలు
శయ్య నధివసించు సౌందర్య పరమావ
ధిని మహేంద్రభోగి గనియె హనుమ.

దరికి నడుగ కోడెత్రాచుగా, భుజగభూ
షణుడు మెచ్చు నాభరణము వోలె
లలిత లలిత పుణ్యాలలనా భుజంగుని
అమితభోగి రావణాసురు గనె.

చీని చీనాంబరమ్ముల నూని, స్వర్ణ
వజ్ర వైడూర్య మరకతాభరణ భూషి
తాంగుడై, మదన సామ్రాజ్య సాంగచక్ర
వర్తినా నాత్మభూముఖభవుడు వెలిగె.

వేదవేదాంగ విజ్ఞానమూర్తి, కోటి
లింగపూజా విధానాబ్జ భృంగరాజ
మమితభుజబల విక్రమానమిత భూర్భు
వస్స్వర్లోకుడయ్యు నవశ్యదేహి.

భవనమందు నిఖిల భువనములం దింద్రి
యోపభోగ్యమౌ అనూహ్యవస్తు
చయము నిండియుండె, సకలవాంఛా సమా
[illegible] సన్నిహితియును.

ఆ హార్మ్యమందున నణ్వణువు పరిశీల
నానంతరము సైత మవనిజాత
జాడతోచమి గుండెజారగా సందేహ
పడసాగె సీతకన్పడునె యంచు
కార్యమ్ము సాధింపకయ యెట్లుపోదు! ఆ
పోకకంటెను చచ్చిపోవ నయము
దేవినై అనినోడి తిరిగిపోవుటకంటె
అవమాన మింకేమి అవనిగలదు!

దర్శనములేని నిష్ఫలతపన యయ్యె
శాంతి నీయని జీవనసమరమట్లు
ఉదధిలంఘింపవచ్చును చదువులెల్ల
చదువగావచ్చు సత్యదర్శనమె అరిది.

గడువు దాటిపోయె. కడలి దాటిన కడ
ముట్టవాయె యత్నములు, ఫలాఫ
లములు యత్నముననె సమకూరవనుటకు
ఇంతకంటె సాక్ష్య మేమివలయు!

సుగ్రీవునాజ్ఞ నెరపని
ఏ గ్రీవమైన తెగెడి, మృత్యువు నిట ఏ
కగ్రీవముగ వరించుట
యే గ్రాహ్యంబైన మార్గ మీ దుస్థితినిన్.

ఏ మొగమున వెడలెద నే
నేమని వచియింతు, నిట్టులే యిట గడుపన్
ఆ మహనీయులు మది నే
నేమో నెరవేర్తునంచు నెంచెదరింకన్.

ఆశాభంగమ్మైన ని
రాశా జీవనముకన్న ఆత్మార్పణ మే
లీ సంసారము నందున
ఆశా బంధమును మించు ఆశ్రయమున్నే !

భీతహరిణాక్షి ఆనా
డీతని వలజిక్కి ఏడ్పు నేడ్చియె యుండున్
ధాతయె వ్రాసిన వంకర
గీతలుగా మారునొక్కొ ! కృతపుణ్యమ్ముల్.

అదిగాక సీతయే ఆ
వ్యథ దుర్భరమై తెగించి పడి సంద్రమునన్
వదలెనొ ప్రాణమ్ముల ? ఆ
పద లెంతలుసేయు నెంతవారలకైనన్.

అదె నిజమగుచో రాముని
ఎద వ్రయ్యలుకాదొ ! అనుజుడేరీతి మనున్
ఇది యిట్లైన అయోధ్యయు
మది క్రుంగదె ! భరతుడింక మడియడె తపనన్.

అని చింతించియు నే ని
ట్లనుకొనుచే పాప, మెంతకైనను నాశా
జనకములగు భావనలే
మనుజునకున్ జూపు ధర్మ మార్గము లనుచున్.

బ్రతికి ఎన్నేని సాధింపవచ్చు గాని
చచ్చి సాధించునది యేమి! చచ్చుటనము
చావుకంటె ప్రమాదము, చేవగలుగు
ధీవరుడు కాపుమని వేడ తీరు వెతలు.

దైవీ శక్తుల నన్నిటి
నావాహనచేసి నియమితాత్ముడనై సు
గ్రీవాజ్ఞ దలచి చొచ్చెద
ఆవనము నశోకమందురట ఇటలంకన్.

అనుచు నశోకుండై యా
వనమున శోకార్తిగుందు వనితారత్న
మ్మునుగన వినయఘనుండై
హనుమ చనెన్ నీరువెట్టి ఆశావనికిన్.



# నాల్గవ సర్గము

అంగుళీము నంగుళీము రాక్షసాంగనాభి
రక్షితమ్మైన ఎన్నెన్నొ కక్ష్య లతిగ
మించి ఒక పెద్ద చెట్టెక్కి పొంచియుండె
చూడ ముచ్చటగొల్పు నశోకవనిని.

ఒక చెట్టుపైనుండి యొక చెట్టుపై దూక
తలలూచు నవి గాలితగిలినట్లు
గాలి సైత మ్మొంటికాలితో కుంటునా
యన్నట్లు మందమై అట చరించు
అటచరించు చరమ్ము లాజ్ఞానిబద్ధమై
అచరమ్ములన స్తబ్ధమై మెలంగు
మెలకువలోనన్న పలువరించుచునున్న
రావణ స్తుతులునా రవము సెలగు

తరువు లచ్చట చపలచిత్తమ్ము వోలె
పసుపులిడుచంద్రు చీకటుల్ తిరిగినట్లు
కోరచూపుల కొరకొర గూడుకట్టి
మించు మెరపులగూడ వంచించునట్లు.

కాలవాహినిదేలు లంకలు సుఖాలు
క్రుంగుబాటులు త్రవ్విన గుండములును
ముడుతలై ఎగుడుదిగుడుగ మొగములెల్ల
వరదపొడిచిన యిండ్లట్లు వన్నెదరిగె.

కలయదిరిగి అశోకవృక్షమ్ము నీడ
దుఃఖదోదూయమాన సుదూరతీర
ములకు చూడక చూచుచు పొగల గప్పు
వడిన జ్వాలదగ్నివలెనున్న పడతి గాంచె.

పీతవసన, భీత భీతమృగేక్షణ
నీలవేణి, ఫాలనిహితపాణి
జ్ఞప్తి వెన్నుచోనగ సకలేంద్రియమ్ముల
నేకముఖము చేసె నీమెదృష్టి.

ఋశ్యమూకగిరిని ఏనాఁడొ తామట్లు
కాంచినప్పు డీమె కట్టుకున్న
చీరమెరపు నుంతచెడియు నిప్పటికిని
సొంపుసెడక కంటి కింపుగూర్చు.

చీరకందమైన నారీమణి ధరింప
నారచీర కేని పేరువచ్చు
ఒక్క సమిధ సవనయోగ్యమై నిర్జర
ప్రీతిపాత్రమౌ నదృష్టమింతె.

ఏ దానవుని కామ మేమని గర్హింతు
ఏ యోగి తపియింప డీమెగోరి!
ఏ యసురీమోహ మేమని నిరసింతు
సురలైన నసియింపరీ సుదతి జూడ

ఏ పుణ్య జనులోభ మెంతకుగాకుండు
వెన్నెలల్ మేయరే విబుధులయ్యు
ఏ నిశాచరుమద మిర్మ్ర చంద్రముఖి మ్రోల
తలవంచ దీ జన్మఫలము నంద.

రామచంద్రుని సౌభాగ్యరమకు నెవడు
మచ్చరము నందకుండు సమస్త జీవ
పాళి బ్రోచెడి ఈయమ పాద ధూళి
శిరమునం దాల్చుటే శుభాశీస్సుకాదె !

యోగియా రామచంద్రు వియోగబాధ
సార్థకమ్మని తెలిసె, ఈ చంద్రిక యిట
చంద్రుడట నుంటయెల్ల ఏ యింద్రజాల
మో ! వియోగమె ఆనంద యోగమేమొ !

ధ్యానమగ్నయైన ఆయమ కేరీతి
తెలుపదగునో ! తన్ను నిలువరించు
కొనినవాడె తెలిసికొనజాలు నందురు
పొంచిచూచుటే గ్రహించవీలు.

వాచ్యార్థముల కప్పువడిన కావ్యధ్వని
ఆచారమాత్ర విద్యాభ్యసనము
గాలితిండి తపమ్ముగా నెంచు ఆశీవి
షక్తిన్నపూ హరిచందనమ్ము

బాహ్య ప్రదర్శనాసహ్య భేషజ చికి
త్సా ప్రతారిత బుద్ధి సౌష్ఠవమ్ము
వరద తీసిన జీవవాహిని నివురు గ
ప్పిన అగ్నికణము మాసినయశమ్ము

దూయబడియును లక్ష్యముదూలు తూపు
రాహు నిగళితచంద్ర పై దేహి రామ
దర్శనోచ్ఛ్వాస నిశ్వాస తనులతాంగి
జీర్ణ దేవాలయమ్ము శోకార్ణవమ్ము.

పతిదిదృక్షైక విశ్వాస పటిమ నిన్ని
నాళ్ళు పరమ పతివ్రత ఒక్కొకళ్ళు
గా భరించుచునున్నది కాయమిటుల
అట్లు కాకున్న బ్రతుకునా అబల యిచట !

చుట్టములు లేరు నల్దెసల్ చుట్టుముట్టి
యున్నవారు విమూఢతాచ్ఛన్నమతులు
ఒకతె కొకకన్నుమాత్ర మింకొకతె కొక్క
చెవియె వేరొక తొయ్యలి ఛిన్ననాస.

పొట్టకొరకెద్దియే చేయ బూనుకొనెడి
ఆగ్రహమ్మున భీతలై అన్యులట్లె
అణగి పడియుండగోరు దాస్యైకమతులు
భీతియే వీరి బ్రతుకుల రీతి దీర్చ.

తమపట్ల సేవ లేని తలపెట్టకూడదం
　　చెంతురో అదియ కావించుచుంద్రు
ఏ రీతి తమకన్న నెవరు బాగున్నను
　　తమ కేదో ముప్పుగా తలచుచుంద్రు
అవమానమునకు దామలవాటుపడి అన్యు
　　లవమానపడిన ఆహా యటంద్రు
తమకున్న తనుమనోదారిద్ర్యములు సర్వ
　　లోకాని కున్నట్లు లోదలంత్రు

ఎవరి కెన్నెన్ని ఆపద లెట్లువచ్చి
పడెనో తెలియంగ తహతహ పడుచునుంద్రు
అలసులై దోషమితరుల కంటగట్టి
గుణము తమదిగ ప్రకటించుకొనుచునుంద్రు.

ఆత్మవిశ్వాస మావంతయైన లేని
చింతతో పున చిక్కిన యింతి కింత
నిబ్బరము హృదయ సర్వస్వ నిష్ఠమైన
రామభద్రస్మృతిన్ మోక్షకాము మొకడె.

కందమూలాశనమ్ము సకాల నిత్య
కర్మనిర్వహణమ్మున కానలో ప్ర
శాంత జీవనమున ఆత్మకాంతు సన్ని
ధిని సుఖించిన ఆ దివ్యదినము లరిగె.

ఆమె శిష్టవాక్కు; ఆత డర్థస్ఫూర్తి
అబ్జముఖి కతండు హాసరేఖ
వారిజాక్షికైరి వారలు కనురెప్ప
లెంత కానికాల మేగుదెంచె !

ఇంద్రభోగమ్ములును ఎంత యేవగింపొ !
కానసే కాంతువెన్నంటి కానకేగె
శాంతిసౌఖ్యప్రదాయి ఏకాంతసేవ
కలవడిన ప్రాణ మెట్టుల నన్యమొప్పు !

సిరులగాచిన కల్పతరువైన తరుణీవ
తంస మిట్టు లోకన్నృపాంసు వలను
జిక్కిపోవ ఎంత చిక్కని పొందిక
తక్కుధైర్య మాపకలను జిక్కి

ఇప్పుడేనీమె నిటనుండియిటె వియోగ
జలధి దాటించి కొంపోవ దలతునేని
ఎవరు మెచ్చురు, కేవలాన్వేషకుడవు
దూతమాత్రుడవని నన్నుదూయబట్టి.

నా పిచ్చికాక ఈయమ
నా పని వివరించినంత నమ్మెనె ! ఆర్తిన్
సైపగ లేనంతట రా
నొప్పునె, నావెంట రామయోషామణియై !

శత్రువులదాకి జీవనసమరమందు
జయము సాధించు బ్రతుకులే సార్థకములు
ఆచరితమైన దొక్కడే ఆత్మవిద్య
సాధనయె సూత్ర మాత్మావబోధమునకు.

ఈ యశోకముపుష్పించి ఎంత యింపు
సొంపు లీనుచునున్నదో సుదతి అంత
వంతగుందుచు దిగులున వాడి శోక
వనధి తలమునక్కలుగ అనుక్షణము గడపు.

శోకవివరము లరయ నశోక సాంద్ర
పత్ర పుష్పములనెడి నేపథ్యమందు
దాగి కనులార జూచెద తరుణి అనుది
నమ్ము కార్యక్రమము ఉషోదయమ్మునయ్యె.

తెల తెలవారగ ద్విజములు
కలరుతములు సేయ ద్విజనికాయము తనకున్
గలగల స్వస్తి వచింపగ
తొలిదేవులరాజు వెడలె తొయ్యలి తపనన్.

మదన తప్తుండు మదనారి మహిత భక్తు
డమిత విక్రమ తేజో వినమితసురుడు
వేద వేదాంగ వాచ్యార్థ వేత్త యగుట
తన్నుదా నెరుగనేర్వని దానవుండు.

రావణుడున్ దేహోఽహం
భావుండు శివోఽహమనెడి పదవాచ్యార్థా
రావణుడున్ భుజబల సం
రావణు డేతెంచె జనకరాట్తనయ గనన్.

బ్రహ్మకులమందు బుట్టిన బ్రాహ్మణబ్రు
వుల పొగడ్తల భుజములుప్పొంగ అంగ
నా భుజంగుడు వై దేహిశోభ నామె
దేహమున గన పెనగు దిదృక్షువతడు.

అప్సరలు నాగ వెంట శతాబ్జముఖులు
ధవళచామరములు తళత్తళల పసిడి
కాగడాల్ వీవనలును బంగారు కలశ
ముల వహించిరి అందముల్ మురియునట్లు

రత్నఖచితమ్ములైన పాత్రముల నాస
వముల మదిరేక్షణలు సోయగముగ దాల్చి
మత్త గజగాములై సాంగ మదనువోలు
మత్తగజరాజు సున్మత్తు హత్తుకొనిరి.

పద్మపాణి చేతబట్టంగదగు ననంగ
సాయకముల కొందరీ యబలల
ఖడ్గపాణులైన కఠిన స్తనల్ ప్రబ
లలుగ వినయమునకు లజ్జలైరి.

కారుమేఘములకు గాచిన మించులు
కామమునకు ప్రేమగాను మిడెడి
కామినీమణుల్ వికారము సాకార
మైన కృతక సుందరాంగసమితి.

వైభవమ్ము తలచి వచ్చిన భామలు
పౌరుషమ్ము మెచ్చు భామినులును
దంభదర్పములకు తబ్బిబ్బులైపోయి
మోజుపడిన కామినీజనమ్ము.

నరసురాసుర యక్షగంధర్వ కాంత
లందఱున్ వలచివచ్చిన యట్టివారె
అతడు బలవంతముగ తెచ్చినట్టి దొకతె
ఆమె వైదేహి దేహసర్వాత్ముడతడు.

దరికి నరుదెంచుచున్న సందడిని వినియు
అతని పరికించి హనుమ తా నంతిపురము
నందు జూచిన అసురేశుడని యెరింగి
ఇంక వైనము దెలియ చెట్టెక్కి దాగె.

అవనిజాముఖవనజ మూ యసురరాక
మ్లానమై మిగులుశోభయు మాసిపోయె
కటికవానిని గాంచు మేకయన కాయ
మెల్ల గజగజగా తల్లడిల్లిపోయె.

దావానలమున నేత్రోవ దొరకక అగ్గి
వలజిక్కు హరిణశాబకము వోలె

తాళవృక్షోన్న తోత్తాల తరంగాల
నడిసంద్రమున బడ్డ నావవోలె

సర్వమ్ము గోల్పోయి సాటివారల చిన్న
చూపుతూపుల కుందు సుదతివోలె

బ్రతుకు బేరములోన చితికి చావొక్కటే
మార్గమైనట్టి సన్మార్గువోలె

ఊదువారు లేక ఉడిగిన అగ్గినా
పాపియైన రాజు పాలన వలె
తిండి కరవున ఉపదేశమ్మునా వన్నె
దక్కి చిక్కియున్న తన్విగాంచి

అనుజుడంతట కనులలో ఆశలెల్ల
ఇముడ ప్రేముడి సీత సమీక్ష చేసి
నిన్ను నే పట్టితిని కాని నీవు నన్ను
మదిని పట్టించుకొనవైతి మందభాగ్య !

నిన్ను వేధింప నే నవినీతిపరుడ
కాను నీ కయి నా కనుల్ కాయగాచె
కోరి వరియించువరకు నేనూరకుందు
నిన్ను పెండ్లాడ విద్యున్నిభాంగి.

ఇన్నినాళ్ళుగ చూచితి వితని భక్తి
రక్తియున్, నీకునై పంచప్రాణములను
విడువగల్గుదునే కాని విడువజాల
ముదిత ! నీపైని నాదు వ్యామోహ మింత!

వనితరో చూచితివి నాదు వైభవమ్ము
ప్రాణములు నీకునై కడపట్టుచున్న
వింక పీడుము విషమ పరీక్షలెల్ల
ఉద్ధరించి వరింపు నన్నో శుభాంగి !

మోహ సాగరమున తలమునకలైన
తన్ను తరియింపజేసెడి నావ నీవె
మదనతాపమునంగాలి మడియుచుంటి
మంటలార్పగజాలు నీకంటె చలువ.

రాత్రి చరియించి ఒక అర్ధరాత్రి యించు
కంత కునికితి ఇంతలో నయ్యె స్నాన
సాంధ్యజపవేళ నా తపస్సాధ్య నీవె
ధ్యానమున నీవె నా తనుప్రాణ మీవె !

అతనుడయ్యె నుమేశు నేత్రాగ్ని, దాస
అతడు తనువుల తానగ్నియై రగుల్చు
ఈ తనువు లేకయుండిన నెంతబాగు
ఇచ్చవచ్చినవారి బాధింపవచ్చు.

మదనజడుడైన ఆ రాము మదిదలంచి
ఏల నన్నేవగింతువో ఏ నెరుంగ
ఆతడున్నాడో లేడో ఈ భూతలమున
అతనికై యింత తపియించు అజ్ఞ వీవె.

హాయిగా నాసవమ్ముల నారగించి
స్వర్గసీమల దేలి యీ వైభవమున
పట్టమహిషిగ నీదు సపత్నులెల్ల
గొలువ నానందమును కొల్లగొనగ రాదో !

ఉన్న రాజ్యము తలిదండ్రు లూడగొట్ట
కారడవి జేరి చచ్చు సంసార మీదు
ఆయమాయకు డెవరికే సాయమగును
రావణునకాత డీడైన కావ రాడో !

తనువ శాశ్వతమోతన్వి ! ధరనుగల్గు
సుఖములన్నింటి అదనున జూరవచ్చు
అజ్ఞ లెరుగరు సమయ సంహాత దినాలు
తిరిగిరావని అవనిజ యెరుగలేదో !

అతడు మాటాడ నుద్యుక్తుడైన యపుడె
అవి తృణప్రాయమని చెప్ప నవని జాత
గడ్డిపోచ పరస్పర మడ్డుచేసి
చెవుల మూసెను శివశివశివ యటంచు.

అతని కర్ణకఠోర వాక్యార్థములకు
బధిరయై ఆమె శ్రీరామ మధురనామ
జపముసేయుచు ఆత్మసంసర్గవోలె
కదిరి కూర్చుండె ఒక నిండుకుండ యనగ.



# అయిదవ సర్గము

అమిత రావణు కన్నెత్తియైన చూడ
కుండ ఎన్నాళ్ళు చెవివినకుండ ఏవ
గించుకొనుచుండెనో తమాయించి నాటి
కామె తల పెట్టె బధిర శంఖారవమ్ము.

"చూడ నీవంక, కన్నెత్తి చూతునేని
రావణా! నీదు ఆర్భాట మేవగింపె
ఆ సురీ సంపదల సర్వమందు నీవు
వైభవమ్మొకడే ఆత్మవైభవమ్ము.

కండకావరమున నీకు కామ మదియ
ప్రేమగాదోచు నీ నేర్చు విద్య లింతె
భువనసామ్రాజ్య మొక గడ్డిపోచయేని
కాని రాముని నిరసించు కామకామి!

ఒకని కంకితమైనట్టి ఉవిద నిట్లు
మోసమున దెచ్చి ఏమేమొ యీ సనాత
నంపు వేషాలు లోకుల కొంపగూల్చు
ఆసురీభావనలు! నోరుమూసికొనుము.

నీతి నియమాల నెవరుగానీ యెరుంగ
రింత అన్నట్లు ఎలుగెత్తి యింతభ్రష్ట
వాదనల జేయుచున్ వేదవాది నందు
వింతకన్నను విపరీత మేమికలదు!

జాలికిన్ జాలిగల్గు అజ్ఞానమూర్తి
నైన నీవెంట వేదవాక్యముల వల్లె
వైచినంతనె తమ కొంటపట్టె ననెడి
వారుమాత్రమే నీకు నీవారలగుట !

బ్రహ్మవిదులైన విప్రులీలంక నొకరు
లేరు కాబోలు, ఉన్నను నోరు మెదప
జాలకుండిరొ జడిసి అజ్ఞానతమము
బాపు శ్రీరామచంద్రుడే తాప మడపు.

దేహబుద్ధిని నీ వెంటఁదిరుగు సుంద
రాకృతుల దన్ని తనియు, మావంతయేని
జ్ఞానమున్ లేక జనకరాజర్షి అల్లు
డైన శ్రీరాము పత్నికై ఆసపడెదు !

పిచ్చివాడవు నన్ చెరపెట్టి ఆహ
రింపజూతువు నా మన మింతకన్న
అజ్ఞుడుండునె ! లేక మీరభ్యసించు
కాకి బంగరు చదువులే కారణమ్మొ !

ఇంత దారుణమున్ సల్పితీవటన్న
మంట నా యెద భగ్గునమండు, కాని
తరణికులమణి పదపడి తప్పుడైన
వాని మన్నించి కాచు విపశ్చితుండు.

జాగుసేయక ధర్మాత్ము శరణుజొచ్చి
తప్పు మన్నింప వేఁడు; "మీతండ్రు నన్ను
వలచె దుర్మార్గమున; మంచిబాట చూప
దగిన వాఁడ"ని చెప్పి నేనగుదునండ.

నటన నేర్చితి వా మహానటుఁడు దేహ
మందు నటియించు ఆవంత అంటులేక
విశ్వముల నేలుచుండియు బిచ్చమెత్తు
బుద్ధిమంతుల కాతని పోల్కి తెలియు.

ఆత్మలింగము దేహివై అందుకొనగ
జూచు నీదియు ఒకచూపె ! సుదతిశోభ
పండ్లనావంత నవ్వు విశ్వమ్మునంత
హృదయ పుస్తకమున తొలిచదువు నెరుక.

చదువు లింతగ జదివి అజ్ఞానివైతి
చిత్తశాంతని కోల్పోయి చెనటివైతి
బలము తెగపెంచి నీరసంపడితి; వెంత
యెంతో ధనమున్న కటిక దరిద్రుఁ డీవు.

గర్విష్టి చదువులు కాల్పనా నీదంభ
పూజలు నీదేహపూజ కావె !
దేవతార్చనలెల్ల దేహార్చనల జూపు
వేషాలతోనె సద్విప్రుడగునె !

కులము దొడ్డదైయైన గుణకర్మహీనమా
కుల విచారము వ్యాకులము కాదె !
ఐనవంశమ్మున నావిర్భవించితి
వట్టులే నేను సద్వంశభవను.

తప్పులొప్పుకొన్న దండనముండదు
ఆర్యపుత్రుడగు దయార్ద్రు; డీవు
కాళ్ళు పట్టుకొనిన కరుణించు, బ్రతుకంగ
దలతువేని మూర్ఖతను వదలుము.

అతను వచ్చువరకు ఆగడమ్ములు మాన
వేని చావుతప్ప దెంతకేని
రామబాణమహిమ, లక్ష్మణుకాటు నీ
వెరుగకుంట పాపభరముకతన.

నన్నుగోర సర్వనాశము తప్పదు
సకల భోగములును సమసిపోవు
సపరివార మరణ విపరీతచర్య మీ
దానవులకు నేని దానవమ్మ.

వ్యక్తిగా పాపి చావంగవచ్చు, సంఘ
మరణ కారణ మగుట దుర్మార్గమగును
ఒళ్లు తెలియుము మూఢ ! నీ కళ్లు తెరచి
చూచుకొను మీవు కామపిశాచవశుడ !

అనిన వ్యక్తిగ తానెంతకైన ఓర్చు;
మహిని ఆదర్శ సంఘ నిర్మాత కాగ
నెంచు కామి విమర్శ సహింపలేడు
పరులు ధర్మమ్మె తెలిపిన భగ్గుమనును.

"నీమొగముచూచి సైచితి
నీమాటలు కట్టిపెట్టు; నినుగావగ ఏ
రాముఁడు దిగివచ్చునొ సు
త్రామ విజయుదాక మూఢతారుణ్యఖనీ!

ఇంకనెన్నాళ్లొ నేను సహింపజాల
మదనతాపముమించి దుర్మార్గమైన
మంకుపట్టున నాయెడల్ మండిపోవు
ఈగతిన్ సైప; నీయాట సాగబోదు.

నిన్ను కాంక్షించుటెందుకో నీకు తెలియ
దింత సౌందర్యరాశికి గంతవోని
నీరసుఁడు భర్త యగుటయు నీవుకూడ
తగుదునని బొంతగా వానిదగులుకొనుట
రసికలోకానికే సిగ్గు రమ్యవదన!

నిన్ను కాపాడవచ్చిననన్ను దాస్య
మునకు నలవాటుపడి పెడమొగము వెట్టి
మగఁడు మగడని మానవమాత్రు నెంచి
కొంచెపరచినగూడ సహించియుంటి.

పదిమాసములయ్యె వృథా
అదిగో యిదిగో యటంచు ఆరెండేగున్
మది మార్చుకుందువని నా
హృదయేశ్వరి వగుదువంచు నెంచితి; నీవా !

పదవడి వగచెదు; నిన్నా
వదలను ముక్కంటి యెత్తి వచ్చినగానీ;
అదనెరిగి సుఖింతువా ఆ
పదలం గొని తెచ్చుకొనెదో వదలితి నీకే.

పదును తప్పిన పొలము నెవండు దున్ను
కష్టములు కోరివరియింప కాచునెవడు
భర్త నీవనుకొన్నట్లు బ్రతికియున్న
భార్య నినాళ్ళు వదలునే పరునియింట !

రానే లేడిటకాతడు
పోనీ వచ్చినను తనువు ముక్కల్ ముక్కల్
గా నీముందే నరకెద
కానన్ నీబాగు నన్ను కామించుటయే.

ముదితరో ఎవరికైనను ముందుచూపు
వలయునే కాని యీ మొండిపట్టు తగదు
గడువుదాటిన మరునాడు కాకులకును
గ్రద్దలకు తిండియగుదువు నీకాయ మబల !

మరచితిని నాడు సీతోడమసలు వీరి
ముద్దయగుదువు కాకులు గ్రద్దలేల !
త్రాడు తెగుదాక లాగక తరుణమందె
తనిసి తన్విన తనువులు ధన్యమగును.

వడకి సేవింత్రు నన్ను దిక్పాలురెల్ల
ఆ పురందరుడైన నన్నాగలేడు
పిచ్చి నియమాలతో వృధాపుచ్చకుండ
ఇహసుఖమ్ముల దేలి నన్నేలుకొనుము.

అనిన రామాజ్ఞలేక కోపాగ్ని నిన్ను
కాల్పకయ సైచియుంటిని కాలసర్ప
దష్టులంగావగా నేరితరము ! నుదుటి
వ్రాత ధాతయు సరిచేసి వ్రాయలేడు.

అనిన సహనమ్ము కోల్పోయి యట నిశాచ
రీగణమ్మును నిలిపి బాగోగు దెలిపి
సామదానాల కాకున్న ఆమెనింక
దండనోపాయమునసైన దారివెట్ట.

మోహమ్మెంతకు తగదీ
దేహమ్మె కోర్కెలెల్ల తీరునటంచున్
ఈహా మృగతృష్ణలలో
దాహముతీరంగ సర్వదా భ్రమియించున్.

# ఆరవ సర్గము

అదియెల్ల గాంచి పావని
యెదనాంధ్యము రేగ కంట నేరులువారన్
ఇదియాస్థితి! ఆర్తావను
హృదయేశ్వరి కింత చిత్రమేముండు భువిన్.

ఒక్కపరి మోహమునజిక్క ఉర్వీజాత
యంత సద్ధర్మచారిణి యింతవంత
కుందుచుండగ తరగని కోర్కెలబడి
తిరుగువారల కింక నే దిక్కుకలదు!

జనకరాజర్షి పాలిత, ఇనకులాని
కైన కోడలు, శ్రీరామునను గుపత్ని
భర్తవెన్నంటి కానలబడిన సాధ్వి
మోహమెంతేసి కొంపల ముంచివైచు!

అనుకొనుచునున్న యంతలో నామెమీద
దయవుగా నుంచబడినట్టి కరకుటసుర
లొక్కరొకొక్క ఉపదేశ మూందసాగి
శివనిజయు భూరుహమ్ముగ నాలకింప.

ఏకజటయెత్తు, నగలకై ప్రాకులాట
ఆమె దినచర్య, వైదేహి కనియె, "నీకు
నేను నారాలనగలు ఎన్నెన్నొచీర
లమరు నను కేశు చేపట్టుమా "యటంచు

ద్విజట త్రిజటలు నీవొక్క విభవమాత్ర
మునకెగాక చతుర్దశ భువనములకు
బెదురు నాపగు నీతని వీర్యశౌర్య
దర్పముల జూచి వరియింప దగుదు వనిరి.

ఒకతె భగ్నాశ దుఃఖంపు టూహలనెడి
ఊయెలల నూగు ఇతరుల నూపుచుండు
ఎన్నడే శుభముకల్గిన ఎన్నినాళ్ళ
భోగమిదియని వగచి వాపోవుచుండు.

ఆమె జానకికనె మగండంతవాడె
నయె ఏనాడొ తనచేతనొ ప్రయత్న
మొనరించియెయుండు విఫలుడై యుండనోపు
భువిని ఉన్నాడొలేడొ యీ పూన్కివిడుము

ఏకాక్షి ఏకజిహ్వయు
ఏక కర్ణ ఏకనాస ఏకోరువునున్
చీకిన టెంకల ఉబుసుం
బోకల ముచ్చట్లు ప్రొద్దుపుచ్చెడి గరితల్.

ఏకకంఠాన అందరనేకతీర్ల
అసురరాజును పొగడియు, అసునయించి
ముద్దుచూపియు, ఒకపరి గద్దరించి
పీకి పిండమ్ము పెట్టి చెప్పిరి వరింప.

వారిలోన ద్విజిహ్వ ఎవ్వారుచూడ
నపుడు బోధించె "భీష్మించు టదియ నయము
వలపుతీగకు నీ మొండిపట్టె నీకు
పిడచకట్టిన నాల్క కాపిదప వోలె".

అనునయముల సాధించెడి
పనికాదని యెరిగి వారు పదపడి "నీవొ
ప్పిన సరి, ఒప్పనిచో నీ
పనిసరి యీనాడె" యనుచు భయపెట్టంగన్.

ఇట్లు నిన్ జీల్చివై చెద, మిట్లు కండ
కండగా నరికి ముక్కముక్కగ భుజింతు
మిట్లు మ్రింగుదమనుచు నటించి చూప
అవనిజ వడంకె లేరావియాకు వోలె.

అట్లు వేధించి రవ్వారు, యామములును
కడచె వేధించి వేధించి, కాల మొకరి
కిట్టె కందెనవెట్టిన యిరుసువోలె
తిరిగి పరుగెత్తు ఒకరికి అరిగితిరుగు.

నిరసన వ్రతమయ్యును నిద్రావి
పండ్లమూ జూచియున్, మునిపండ్ల కొరికి
ఆత్మవంతుడు దేహసౌఖ్యముల నట్లు
అంటియుంటని జానికి అలసికూడ

వారికనె "మీరునన్ జంపి భక్షణమ్ము
సేయుదురుగాక రాముని చిత్తమందు
నిలిపి స్వర్గమ్ము చేరెద తలపనైన
దలప, కన్నెత్తిచూడ మీదానవేంద్రు"

ఆమె తలిరాకు పెనుగాలి నల్లలాడి
నట్లు గజగజ వడకుచు ఆయశోక
వృక్షముంబట్టి కన్నీరు పెట్టె, హృదయ
కూపమున కేత మెత్తి వ్యాకులముదోడె.

మంచిచెప్పిన అనరాని మాటలాడి
మరది తరిమితి నానాడు, మాయకాని
వలను జిక్కితి ఇంత నావలనగాక
ఎవరు చేసిన తప్పేమియిందు గలదు !

ముద్దుముచ్చటతీరుమోజున ఆర్యపు
త్రుని లేడిపిల్లకై త్రోలినాను
కన్నీరు మున్నీరుగా లక్ష్మణుండు నా
వంక చూచిన తప్పుపట్టినాను
జంకుగొంకులు లేక వంకరమాటల
ఎదతూట్లుపొడిచి పంపించినాను
ఆత్మరక్షణ చేతనౌనని బీరముల్
పలికితి ఆయహం భావమేమొ !

అతడు మన్నించె మాట లంతంత లనిన
అన్నయాజ్ఞకు మీరనియుతని వ్రతము
భంగమొనరించి సర్వము భంగపోతి
తీరని వియోగమే కొని తెచ్చుకొంటి.

ఇంత విపదంబునిధి కుండ ఈదుగాని
పనికి రానట్టి యీ నావ మునిగిపోదు
జరుగవలసిన రీతినే జరుగునన్ని
చావునున్ రాదు రమ్మన్న సమయమునకు.

ఆ కృతజ్ఞతయేమి ! ఆహా అదేమి
ధర్మసూక్ష్మావగాహన ! ధన్యులైన
వారికడ ఆయ్యెదుండెడి; పాపమేమి
చేసితినో దూరమైతి కృశించుచుంటి.

బ్రతుకనెంచికూడ బ్రతుకంగజాలని
చావదలచికూడ చావలేని
యింత అవశమైన యీ మానవుని జీవి
తమ్ము విలువలేని సొమ్ము వమ్ము.

ఇంటలేని యప్పు డీనీచుడిటకు నన్
దెచ్చెగాని ధర్మధీరుడైన
పురుషసింహునింట జొరనేర్చునే కుక్క
ఇంక బ్రతికి లాభమేమి కలదు!

నన్నువీడి బ్రతికియున్నాడో లేదో రా
కుండునొక్కొ బ్రతికి యుండెనేని
ఒక్కశరమువైచి ఉదధి నింకింపగ
జాలుప్రభువు ప్రాలుమాలనేల.!

తెల తెలవార నిశాచర
లలనాగణమంత నరిగె రావణునకు ఆ
వలి వృత్తాంతము తామై
తెలుపగ భూజాత మనసుతీరులు తీర్చెల్.



# ఏడవ సర్గము

పరికించుచున్న హనుమకు
పరిపరివిధములగు ఆత్మభావమ్ములచి
క్కిరిబిక్కిరిగా తోచెను
పరువెత్తెడి భావములకు పద్ధతి కలదో!

కుడికన్నదరగ ఆ సం
దడినుండియు శుభమటన్న తలపొదవెను; ఎ
ద్దడినీరమైన శుచిగా
నిడిననె సంతృప్తి శకున మీగతి శుభమున్.

అలవాటుపడిన ప్రాణం
బిలసత్యమటంచు నెంచు, నేయేతలపుల్
బలముగ మదినిలచునో ఆ
తలపులు కార్యముగ పరిణతమ్మగుచుండున్.

అర్ధరాత్రివరకు నాడుచు పాడుచు
త్రాగితూగి తూగి త్రాగి రసుర
లందు త్రిజటయన్ననామె అమాంతము
కలలదేవి నిట్టనిలువు నిల్చె

"లేవె చంటీ! ఇరమ్మదా! లేవె జమిలి!
లేవె చపలాక్షి! గోస్తనీ లేవె యనుచు
అందరిని తట్టిలేపి తానపుడె కన్న
కలను తెలుపగ తపస్పన తెలివిదోచె.

"మనము దురదృష్టవంతుల మనగ చుట్టు
తూగుచునె అసురలందరు మూగికొనిరి
ఏమిటో చెప్పిచావవేమే అదేమొ
నీకు నెదివచ్చినను ఇంతియేనే" యటంచు.

త్రిజట వివరించె "రోజులుతీరె మనకు
ఎవరి ననదగ 'శివశివ' యిన్నినాళ్లు
పీకికొనితింటిమో ఆమె వెలుగు, రాత్రి
చరుల సంఘమ్ము త్వరలోనె సమసిపోవు.

సత్యమందురు తెలవారుజాము కలలు
తలుచుకొనినంత గుండెలు దద్దరిల్లు"
అనిన నొక్కింత కుదురుగా నద్దియేమొ
చెప్పుమని మూగిరట చెవులప్పగించి.

త్రిజట చెప్పె నద్వితీయుండు సద్వితీ
యముగ కానిపించె; అందమందు
ఉభయులుభయులే మహోన్నత గజరాజు
పైన సీతకడకు వచ్చినారు.

కడలినుండి యపుడె వెడలిన చందాన
సీతయుండె నబ్ధిచెంత, వార
లెక్కుగజము నాల్గుదిక్కులనన్ నాల్గు
ధవళదంతములను దాల్చియుండె.

భర్తృసన్నిధి నామె యుద్బాహువగుచు
సూర్య చంద్రుల నంటె నసూర్యపశ్య;
ఇభము కదలెను మేరుసన్నిభము, లంక
జేరెనది, యింతలో కల జారిపోయె.

అంత నింకొకకల; పదునారు కళల
నంగ పదునారు వృషభమ్ము లారథమ్ము
లాగ సేనాసమేతుడై రామచంద్రు
డటకె లంకకు వచ్చినా డింతలోనె.

రామచంద్రు డినప్రభా రాజితమ్ము
పుష్పకము నెక్కి ఉత్తరముగ నరిగెను
భయము గదురంగ లోకముల్ పదియునాల్గు
గజగజ వడంకినట్లుగా గానిపించె.

అతనిబోలిన వారలు, నతని కన్న
లార గనజాలువారలు, నతని గెలువ
గల్గువారలు నుండరు, ఖాయమైన
మాట నాయది; నే పొల్లుమాట లెరుగ.

ఏమి చిత్రమ్మొకాని నాకింతలోనె
మరొక కలవచ్చి నా తల తిరిగిపోయె
రక్తవర్ణాంబరుడయి రావణుండు
పుష్పకమునుండి తా పడిపోయెనంట!

క్రిందపడ నొక్క ముండిత కేశ, అసిత
వస్త్ర ధారిణి, అతని చేపట్టి యీడ్చు
కొనుచు నేగెను, నా యెద క్రుంగిపోయె
కాయమల్లంతలో నీరుగారిపోయె.

తైలసిక్తతనువు తైలము త్రావుచు
గంతులిడుచు నొక్క గార్దభమ్ము
నెక్కి బయలుదేరి యొక్కచో కెవ్వన
కేకవైచె గాలి సోకినట్లు.

నేలబడినయంత గాలితో మాటాడి
నట్లు తనకుదానె యాలపించి
పిచ్చిపిచ్చిగ నెదో ప్రేలుచు ప్రొళ్ళుచు
పూతిగంధమైన గోతగూలె.

ఒళ్ళు ఝల్లుమనియె నువిద యొక్కతె యెఱ్ఱ
చీరకట్టుకుని శరీరమెల్ల
బురద నలది నల్లభూతముగా ఉరి
త్రాడువోసి లాగె దక్షిణముగ.

కుంభకర్ణుడు, లంకేశు కొమరులెల్ల
ముండితశిరస్కులై తైలమున మునింగి
అందరున్ దక్షిణమ్ముగ నరిగినారు
పాప మతినీచమైనట్టి వాహనముల.

అందరున్ తప్పఁ ద్రాగిరి, ఆలపించి
శేవాయేవేవో కూతల, నెట్టినైన
గుడ్డలం గట్టుకుని మోము జిడ్డుకార
మృత్యుముఖమున కన్నట్టు లేగినారు.

చతురంగ సమేతులు దు
ర్గతిపాలై యోడ యుద్ధరంగమునందున్
చితికిన బ్రతుకుల వెతలన్
గతుకులబడి చనిరో మునగ కాలాబ్ధిననన్.

ఒక విభీషణుండె యున్నతుడై చతు
ర్దంతి నెక్కి ధవళధవళ వస్త్ర
ధారియై పురాన నూరేగనరుగు ను
త్సవములోని దేవతగ జెలంగె.

వివిధ నృత్యగాన భేరీమృదంగ సం
హితలు దిశల పిక్కటిల్లిపోవ
మల్లెపూవువోని తెల్లనివస్త్రముల్
మరియు తెల్లనైన మనసుపూలు.

దానవుల మది ముద్దమందార; భోగ
రాగములకయి తీగలుసాగుచుండు
ముదిరిరాగము చీకటిముద్ద యగుచు
చిమ్మచీకటి నించు మోహమ్ము పెంచి.

ఈ విభీషణు డొక్కడే యింతలంక
మునిగిపోకుండ కాపాడుననగ దోచు
తెలివిగల దానవులకెల్ల తేట యతను
సత్వగుణమది మిన్న యేశక్తి కన్న.

రామదూత యెవండో యీలంక గాల్చె
నట, మరియొకస్వప్న మల్లంతలోనె
తప్పత్రాగిన యసురులు తగవులాడు
కొనుచు గోలగ దూపించుకొనుట వింటి.

వీరు లాతనిముందర పిల్లులైరి
బురదగుంటను బడిరి వ్యామోహవశత
అన్యులను గెల్వనే అప్పుడప్పు డైక్య
మొకరికొకరికి, ద్వేషమే సకలమందు.

రావణాత్మజ కుంభకర్ణాదులెల్ల
క్రుంగి కృశియించు బ్రతుకులగోత బడరి
లంకకిక ముప్పె, అందులో శంక లేదు
రాముడే స్వయముగా వచ్చి లంక దాకు.

ఈమె వేడుటకంటె వేరేయుపాయ
మేమియును లేదు; ఓరిమి భూమికంత
ఈమె పల్లెత్తి మాటాడ దెంత లెంత
బాధలం బెట్టినను; కాళ్ళు పట్టుకొనుడు.

మనము పెట్టిన బాధకు మలనేమి
చేసినన్ బాపముండునె! చేతులార
చేసుకుంటిమి; ఈయమ వాసిగల్గు
వంశమున బుట్టినది తప్పుపట్టదింత.

అనెడి మాటలు వినుచున్న యవనిజాత
ఈమె కలలెల్ల నిజమాయెనేని అంత
కన్ననా! వీరలందరి కన్నతల్లి
హోల్లాసై చెద వీరిదోషాల మరచి.

అనుచు నభయహస్తమును జాచెజానకి
అదురుగుండెలెల్ల గుదుటపడగ
కష్టములు, సుఖములు కలకాలమెంచటనే
కాపురమ్ము సేయునా పుడమిని!



# ఎనిమిదవ సర్గము

కరువు ప్రాంతమునన్ తొలకరిని జల్లు
పడినయట్టులు జానకి యెడమకన్ను
ఎడమబుజమును నదరె, అట్లే నిశాచ
రేశు కయ్యెడ జలియించె నెడమవైపు.

జారె నొక్కింత కట్టిన నారచీర
"బంధనము వీడునా! ఆత్మబంధు వైన
ఆర్యపుత్రుడు సనుదెంచునా! మరంది
దూషణల మోయగా నాదిశేషుడతడు"

వగవబనియేమి యేయమావాస్య నైన
వైచదగు చీకటుల్; నెలదోచునేని
పూర్తిగా నెండిననె విత్తు మొలకయెత్తు
చక్రనేమి క్రమమ్ము సంసారమెల్ల.

కమలముఖి యంత వెన్నెలగలువ యయ్యె
శోకనదిలోన వెన్నెలవాక వారె
నెత్తిగొట్టిన పొలముల కట్టుమోప
నేరువాకయె నేరుగా నేగుదెంచె.

రాహుపీడ వదలి రాకాప్రసన్నతా
రాజితమ్మ, దివ్యభోజనమ్మ,
వదనచంద్ర మంత భక్తచకోర పూ
జాష్ప[illegible] ఘనచంద్రిక [illegible]లయమ్ము.

ఇన్నిగాంచు హనుమ యీయమయే సీత
శంకయేల ఈ శశాంకవదన
రామనామ దీప్తిరంజిత వదనాబ్జ
పవలురాత్రి విరియు పద్మమీమె,

అనితలంచి యింత యానందమును దట్టు
కొనుట కష్ట మెవనికూతురైన
ఈదు దుఃఖజలధినేని యోదార్చువన
సేదదీరి; దీప్తి స్నేహ మొసగు,

ప్రాణమైన వదలు నావేశమున; దుఃఖ
మందునైన సుఖమునందునైన
అదుపు తప్పనట్టి యావేశముల మాన
వుడు చరించు పథము లున్నతములు.

బంధమోక్షము లాశావిభావరీ ప్ర
భానిభమ్ములు; మానవుడీ నిరాశ
ఆశలంజిక్కువడును, దురాశ నొకట ;
అన్నిటన్ స్వస్థు డానంద మందుకొనును.

అసురీగణ పరివృతమైన యీమె
తోడ ఈ స్థితిలోన మాటాడు టెట్లు ?
అందుకని బొత్తుగా మాటలాడకుండ
నేగ నేనేమి చేసిన ట్లింత చేసి !

ఈమె తోడ నిప్పుడే భాషలో మాట
లాడదగునొ! అసరులేని సంస్కృ
తమ్ములోనె భాషణమ్మొనరింతురు
భాష భావములకు వేషమెగద !

ఆమె నన్ను సైత మసురేశు డనుకొను
నేమొ! భాషయేదియేని రావ
ణప్రయుక్తమైన విప్రత గోల్పోవు
వాచ్యమైన వేదవాక్కునట్లు.

గోలచేయ కాకిగోల నొనర్తు రీ
గోలలెల్ల; అంతకూడివచ్చి
రాత్రిచరులు నన్ను రంగమునందింపె
దరు; భవిష్యమెల్ల దానజెడును.

పోర గెలువవలయు వీరుల; నంతట
కడలి దాటవలయు కడగిమరల
కడలి దాటివచ్చిగాని బంధవిముక్త
నీమెజేయ సాధ్యమెట్లు లగును?

అదియుగాక దూతనై యీప్రకారము
చేయగూడ దసలుచెడును వేర
మనవపతికి నజ్ఞుడౌ ప్రతినిధి నూ:3
చూపునీక ఘోరశాప మగును.

యుద్ధమందు విజయమో యపజయమో! యె
వండెరుంగు నొక్క పౌరుషమ్మె
గెలుపు నోటములకు కేవలకారణ
మగుట చూడ మెందునైన జగతి

రామగానమొకడె యీ మహీజాతకు
దెలుపగాని, ఆమె దెలియగాని
ఇంపుసొంపు గల్గు నేకైక భాష, ఆ
భావగమ్యు నెట్లు భాష తెల్పు!

ఎవని దెలియగాని యేమేమి చేసెనో
యెరిగినపుడె కొంతయెరుక కలుగు
వేదవేద్యుడయ్యు వేదాంతవేద్యుడు
అతనిజాడ దెలుపు నాచరితమె.

హనుమ వేదోక్తమైన రామాయణమ్ము
గాన మొనరింపసాగె "భూకాంతుడైన
దాశరథి కానకేగె సోదరుడు, ధర్మ
పత్ని యుభయులు వెనువెంట వచ్చిరంట.

వరము నొకపరి శాపమై పరిణమించు
తనయునకు రాజ్యమీయ మాతగ వరింప
పత్ని కంతట పతి తన ప్రాణమిచ్చె
ఉభయులన్ ద్రోసిరాజనె నొక్కకొడుకు.

లభ్యమైనయట్టి రాజ్యము నొక్కండు
లబ్ధమైనయట్టి రాజ్యమొకడు
తృణము వోలె వీడు దీక్షితులంగన్న
తరణివంశ ముభయతారకమ్ము.

కందమూలాశనమ్ము నేకాంతసేవ
కానలో దివ్యముగ సాగె కాపురమ్ము
మోహ మెంతటివారల ముంచలేదు!
భూమిపుత్రికి వాసనల్ పోకపోయె!

మాయ లేడిని జూచి ఆమాయకముగ
భూమిజ మునింగె నీరస మోహజలధి
నజము నెరిగియు తానవనిజకు మనసు
తీర్ప శ్రీరాముడే బయలుద్దేరె నకట!

అన్నయాజ్ఞకు మీరని యనుజు గుండె
లవియ పరుషమ్ములాడి ఆయవనిజాత
అతని ద్రోలిన దనగ నేమాయె పిదప
అనుచు కన్నీరు నిండిన కనుల సీత

పైకిచూడగ నొక మహావానరమ్ము
కానిపించెను; కల కోతిగాంచుటెంత
యశుభమోకద యనుకుని అయిన నాకు
నిద్ర కెన్నాళ్ళ దూరమో, నేను కన్న

లార గాంచుచునుంటి, నెట్లొను స్వప్న
మసురు డీ రూపమున వచ్చెనాయటన్న
సందియమ్మున నాశలు సమసిపోవ
చతికిలంబడి శోకింపసాగె భూజ.

కాని యీతని మాటల గలుగు శాంతి
రావణుని పల్కులలో లేని ప్రాభవమ్ము
చెవుల విందుగ గానము చేసినట్లు
తనివితీరగ గంగలో మునిగినట్లు.

ఎదనిండిన గరళమునకు
మది మధురూపమ్మొసంగి మాటలలోనన్
తుది నమృతము లొలికించుట
యదె శాంబరవిద్య యిదియు నదికాదుగదా !

అనుకొను నట్లనుకొనుటయె
తన కిష్టముకానిదగుట తర్కించు నెదై
నను క్రొత్తగ చెడునది యే
మని పెడమొగమయ్యు వినుటకై తపియించెన్.

అంత హనుమయనియె నమ్మా మనమ్ము కీ
డెంచుచుండు, దుష్టవంచనమున
జగతి నమ్మకమ్ము సడలి యవిశ్వాస
మదియు తెలివితేటలట్లు చెల్లు.

నమ్మి చెడినవాడు నమ్మక బాగైన
వాడు కలడె! యెవడుపడినవాడె
నమ్మ నమ్మ ననుచు నమ్మట తననేయు
టన్నమాట తెలియ డద్దియేమొ!

ఆత్మవిశ్వాసమే రక్షయా శరీర
ములను నమ్మిన దేహులు మునిగిపోదు
రట్టివారలనే సంశయాత్ములందు
రెవరు వారల గాచి రక్షింపలేరు.

దాశరథు లట్లుగాక సదాశయమ్ము
తోడ నడవిని బడియును గాడితప్పి
నట్టి బండిని రహదారినెంట తిరిగి
తిరిగి విసిగియు ధైర్యము తెచ్చుకొనిరి.

ఆ మహాత్ముల తపన ఏమనగవచ్చు
జానకీ జానకీ యని సరసహృదయు
డైన రాముని పిలుపుల కాకసమ్ము
శబ్దగుణకమ్ము స్తబ్ధమున్ సార్థకమ్ము.

వారి కన్నీరు వాగుల వరదలయ్యె
తరువులే గుండె ఝల్లన నొరిగిపోయె
పిల్లగాలులు కూడ స్తంభింప నుర్వి
యుమ్మగిలె వగచి రెలతటి యోగులేని.

అగ్నిబాణముదూసి యీయవని నెల్ల
దగ్ధమొనరింతురోయా! తహతహపడి
చుక్కలున్ మిన్కుమిన్కుగ జూచె, మంట
తట్టుకొన మింట దూరాల తరలిపోయె.

స్పృహతప్పు జటాయువు ని
స్పృహవాయగ నన్నదమ్ములేగిరి యాతం
డహముడిగి యిహము బాసెను
అహమువ నన్యులకు దెల్పు టజ్ఞతకాదే.

విరిగిన రెక్కలె యచ్చట
జరిగిన దానవము దెల్ప సమయోచితముల్
జరిగించి యుపరముల, సో
దరు లరిగిరి ధరణిలోన ధరణిజగనగన్.

పంపాతీరములంబడి
ఇంపుల కింపైన వార లీగతి రాగా
పంపెను వాలియె నన్నుం
జంపగనని కీశపతియు శంకాత్ముండై

పంపె నదృష్టమె నన్నటు
లంపెనటం చెంచి నేను నరిగితి, సాహా
సొంపైన వారిగను కను
లింపై సుందరములయ్యె నెల్లజగమ్ముల్.

ఆ యదృష్టము దృష్టమైనపుడు శంక
లెల్ల దీరెనో ! ఆశంకలెల్ల దీర
నతఁడు కన్పించెనో స్మృతికందనంత
రెప్పపాటున జన్మ తరించిపోయె.

> అంతమహనీయు డెవ్వరికై తపించు
> నామె వైదేహి, రాజర్షి కామె తనయ
> తనుజ కాకయు నాయన జనకుఁడయ్యె
> పొట్టబుట్టక ఆయమ పుత్రియయ్యె.

కన్నకన్నులె యింతగా కాంతమైన
కన్నతనువులు ధన్యధన్యోన్నతములు
వీరి దూరము చేసినవారి లోఁగ
దీయగల్గినవారి యదృష్టమెంతొ !

> వారు నన్జూచుచే తమవాఁడుగా, మరెట్లు
> వారివాఁడనుగాకుందు ! వారు చూచు
> చూపులో నున్నదది, యేమిచూపొగాని
> చూడదగినది యెల్లను జూచినట్లె!

సూర్యవంశీయు లేలంచి సూర్యపుత్రు
మిత్రులగుటనెకాబోలు మిత్రుఁడయ్యె
తరణి; యాతఁడెకాదె ప్రత్యక్షదైవ
మిత్రుఁడు ననుఁబంపు సూర్యున కీడుజోడు.

మా రాజును సమవేదను
డే రాజ్యముపోయి పత్ని యితరులపాలై
తీరని వైరముతో పగ
తీరక తెగతెంపులయ్యు తీరవు తగవుల్.

అనుజుకై రాజ్యమును వీడినట్టి ఘనుడు
తనకు తనకని పోరు సోదరుల నొక్క
దారి సేయగనౌనని తలచి బుజము
పూన్చి చేర్చితి నా సూర్యపుత్రుకడకు.

అంత సుగ్రీవుడున్ జీరగొంతువోవ
పాడినట్టుల రాముని పసనెరుంగ
వరుసతప్పినవో సాలతరువులేడు
నొక్కపరి నేసి చూపు సంతులనగోరె.

ఏడుసాలములేమి యేడేడు భువన
ములను నిండిన చీకటుల్వోవ నొక్క
కిరణమే చాలునని చూపు తరణివంశ
భవుడు శంకాత్మునకు నసంభవముజూపె.

అతడు సంతుష్టుడై మ్రొక్కె నన్నదీర్ప
అగ్నిసాక్షిగ సోదరన్యాయమునకు
కట్టుపడెదనటంచు వాకట్టుపడియె
ఎంత గుట్టుగదీరెనో యింద్రసుతుడు.

ఇంక రామునకున్ దనఋణము దీర్ప
జాగుసేయగ తగదని సకల దిశల
దిరుగ కపులను, నను యమదిశకు బంపె
జానకిని వెతుకంగనే నా నియమము.

తగవు తీరినవెన్క సోదరుని పుత్రు
నంగదుని జేసె యౌవరాజ్యాభిషిక్తు
ఈ పనిని ముందె చేసిన కాపురములు
కుదురు; లోభము కొంపల గూల్చకున్నె!

అమ్మా! సుగ్రీవుపనుపున నట్లు బయలు
చేరినా మెందరమొ, అబ్ధితీరముననె
ఆగిపోయిరి నే మనోవేగమునను
లంకజొచ్చితినమ్మ నిశ్శంక వినుము.

రామచంద్రుడు దనుజవిరాము డాత్త
కాముడున్ మోహనరూపవికారదూర
ధాముడున్ ముక్తకాముడు దైన్యరాత్రి
సోముడే పంపెనన్ను త్రయీముఖాంగి!

కన్నతల్లిని నమ్మని కాని కాల
మిచటి తనయలు తనయులు నిచటి ధర్మ
దూరవర్తనలున్ కన్నులారగాంచి
సందియంబడుచుండుట సహజమమ్మ.

కాని యాసురభావసంభూత దేహి
నీ శరీరము గొనితెచ్చె నీ మనమ్ము
రామమయమాట నెరుగని రాక్షసుండు
నమ్ము శ్రీరామవహ్ని కింధనము నేను.

ఈ వియోగ మకరి కిభరాజు గురియయ్యె
రాహుపీడనమున రాజునట్లు
భామస్నేహముననె రామాగ్ని రాజిల్లు
దనుజ కాననమ్ము దగ్ధమగును.

నిన్నె స్మరియించుచుండును; కన్నులార
నెప్పుడు గాంచెదనంచు నిరీక్ష సేయు
ఊగు జానకినావ వియోకజలధి
దీనతను గుందునతడు చుక్కానియయ్యె.

అతనిదూత నటన్న స్పష్టతకు సాక్ష్య
ముగ నతండే యొసంగెను ముద్రిక యిది
ఆత్మనై దేహి ఏకశయ్యా మిథస్స
హాయ సూచకమగు నంగుళీయకమ్ము.

ఆముద్ర జూపు ముద్రిక
సోమజ్యోత్స్నా ప్రసన్న సూర్యప్రభలన్
భామ, సుయోగాత్త పరం
ధామమ్ము వియోగసంహితల కర్థమ్మున్.

హా సీతా హా మాత్రో
పాపీ! జానకియు నన్ను వంచించెగదా
ఈ మాయా మృగమునకై
నీ మహిమ నెఱుంగు నేనె నిమ్నపరచితిన్.

తలతిరిగి యొరిగె భూమిా
తలమున తలదాచుకొనసిదా యన నిక సా
వలి వృత్తాంతము విన చే
తులు కాళ్ళాడని నితాంత దుఃఖభరమునన్.



# తొమ్మిదవ సర్గము

నిశ్చేతన భూజాత త
పశ్చర్యను నున్న హనివ లె నచలజగాన్
నిశ్చేష్టుడయ్యె భీతి వి
పశ్చితుడు హాతాచ్ఛభమ్ము ప్రాణముదీయున్.

ఈలీల నీమె ప్రాణము
పోలేదుగదా! శరీరభూజము సుఖదుః
ఖాల ఝరీవేగమ్మున
గూలున్ యోగమున తట్టుకొననగు ప్రాణుల్.

వరద తుడిచిపెట్టు పల్లెలు పట్టణాల్
పంటపొలము కొకట వరద యగును
మంచి చెడుగు సమయమార్గాన సంభవిం
చెడిని; ఏదిమంచి చెడుగదేమి!

ఏవొ జరుగు వాని నావేశవేగాన
మంచియంచు పొంగుమదియు నల్లె
చెడుగటంచు క్రుంగుచిత్తము చేటగు
ఆదుపె ధర్మమగును; కుదురె మదుపు.

హనుమ యిట్లనుకొనుచుండ నామె తెప్ప
రిల్లి "ఈ జీవి బ్రతుకెల్ల రిత్తయయ్యె
ఎడద రామాంకురము నాటి స్మృతిసుధాభి
షేచనము చేసి తీసితి చీకుకలుపు.

అతని గలిసిన దివ్యపాదారవింద!
అతని జూచిన భవ్యనేత్రాబ్జ! ఎదుట
నతనితో మాటలాడినయట్టి సుముఖ!
తెలుపు మాతని సుకృతాకృతిన్ మహాత్మ :

అతని కెవ్వరు సమయాని కారగింపు
చేయుదురొ పుణ్యశీలురు. చెప్పుమయ్య
బక్కచిక్కెనొ దిగులున ! పాప మెపుడు
గాలితిండియె మరది లక్ష్మణుడు జోగి.

పుడమిభారము మోసెడి భోగివోలె
నతడు భరియించె నే ననగూడనట్టి
వెన్నయన్నను, మనసునవెన్న మరది
అన్నమాటకు తప్పని ఆత్మవేత్త !

మాయామృగమునకై నే
మాయంబడిపోయి అతని మాయకుడనుచున్
పోయెడి దనుకన్ దూపుల
దూయంబట్టితిని గుండె తొలుచు పలుకులన్.

అసువులైనను బాసెడి నన్నమాట
తప్పడాతడు సౌమిత్రి; తరిమి తరిమి
అతని వ్రతభంగ మొనరించి వెతలజిక్కి
భంగపోయిన పడతి ఏపాట్లు పడదు !

అతడన్నిపడియు నన్ జా
గ్రత జాగ్రతనూ [illegible] క్రమముగ చుట్టిన్
బ్రతుకుల మార్యాదా ధి
గతుకులు వాయంగ గీతగా రచియించెన్.

నేనెపుడు హద్దుదాటను
గాని యెవండైన నర్థిగా పిలిచిన-కో
నేనున్నదాని నున్న
ట్లే నియమముగూడ దప్పి యేగెదనటకున్.

పిలిచె నాతడంచు దలచితి మూర్ఖుడు
వలచెనంట; మాయబడిన నాకు
పడినపిదప దెలిసి వచ్చిన దెంతకు
చెడెదవనిన వినమి చేటుదెచ్చె.

నేను మాత్రము వింటినా ! నియతిదప్పు
వారలకు పాట్లుతప్పు వెవ్వార లేమి
చెప్పినంగూడ చెవిటికి జెప్పినట్లె
ఊషరమ్మున విత్తన ముంచినట్లె.

గాలితిని వండ్ల దెచ్చు ఏకాకి నింక
మురిపెముల గూర్చ నడుగంగ మొగముచెల్ల
దండువలననె ఆయన నడుగ నిష్క్రి
యుండు నాడేగె; పాపము పండెనిట్లు !

ఏది యెట్లైన నాకొర కింతవగచు
నార్య పుత్రుడటన్న నా కదియ బాధ
అతని సన్నిధి సూపరమైన పండు
అతతబాసిన కేదారమైన నెండు.

హనుమ వినుమయ్య ఒక్క సత్య మ్మదేమి
చిత్రమో గాని నిజము; విచిత్ర సత్య
మతడు వగచుట నాకయియగుట బాధ
యయ్యు నయ్యదె ఆనందమైన బాధ.

అతడె ధన్యుం డెవండు కర్ణాంతనేత్రు
గన్నులారగఁజూచు, నాకసము శబ్ద
గుణకమై సచ్చరిత్రుని గుణములెల్ల
మౌనముగ బల్కు మౌనుల ధ్యానగీతి !

అతనితో మెలగుదునఁగద అతనిలీల
లెంత కర్థముగావె ! అదే విచిత్ర
మేకపత్నీవ్రతుండె కానీ యనేక
భార్యలతనికి నతడు భూభారభర్త.

అవనిభర్త యతడె అవనిజాభర్తయు
ఐనవారికెల్ల నతడె భర్త
కాని వార లెవరు లేనె లేరతనికి
ఈనిశాచపుంసు లైననాడె.

అపును హనుమయ్య ఏమాయెనయ్య పిదప
జగము లేలెడి నాసామి జానకీ వ్య
థాస్వరూపు డెరుంగడె తరణిజూడ
లేని లోకాల జానకీజాని చూచు !

వ్యథల జిక్కినవాని కెవ్వానిబాధ
లెట్లు తెలియును ! కానసే యిట్లు పవన
సూను విన్నంపె నా మహామానవుండు
గాలిదిను యోగులకుగూడ కాదు వెతుక.

అనిన హనుమయు నదడు నాయంతరంగ
మందె యున్నాడు నేను భవాబ్ధిదాటి
వచ్చినాడను భుజములపైన నధివ
సించు మాయమ్మ నయ్యకు జేర్చగలను.

అమ్మ మనమున నిల్పినయతడు యోగి
త్యాగధనుడైన యాతని భోగామేమొ
తెలియువారల తెలివియే తెలివి తేట
దేహబుద్ధికి నీవెట్లు తెలియుదమ్మ !

సీత హనుమను గాంచుచు చిరునగపున
ననియె నీవెట్లుగొంపోదు వసుకు తెల్ల
పట్టిబంధించి నిను మట్టుపెట్టకుండ
వదలుదురె యిద్దియెల్ల నీ భ్రమయెగాని.

అన్యపురుషుని స్పర్శ నే నబ్ధి దాటు
వరకు నైతునె! అదిగాక పట్టుతప్పి
అబ్ధిబడి మునిగిపోవచ్చు నర్యమాన్వ
యమ్మె బెంబేలు పడవచ్చు నదియెరింగి.

రావణుడు నన్ను దెచ్చె బలాత్కరించి
కట్టెగా నాతనినె యంటిపెట్టుకొనక
తప్పదదిగాక నన్ బట్టె సైన్యమపుడు
నీవు తెచ్చిన శుభవార్త నిండెనెడద.

అతడు వచ్చునన్న యాశతో నూపిరి
నిలుపుకొందు నాకునేనె చావు
కోరుకొనుచునుంటి నూరటగల్గించు
నీదుపలుకు సామవేదమట్లు.

హనుమ తలచె సందియమ్మున నీయమ
చిన్నచూపుజూచు నన్నటంచు
ఇంత యసురబలము నీతడెట్టుల దాకు
నని తలంచెనేమొయని బిరాన.

చిన్నకోతిపోలె నున్న రూపమ్మును
కొండయంత భయముగొలుప బెంచె
ఆమె తేరిచూచి యాశ్చర్యపడసాగె
నితడు లంక మ్రింగునేమొ యనుచు.

ఆమె విశ్వాసపుల్ల ముఖారవింద
మరసి మారుతి నాకేదియైన ఎరుక
నొసగుమా తల్లి రాముని కున్నదున్న
యట్లు నే విన్నవించెదనని వచించె.

దీర్ఘనిశ్వాసమున నామె దిగులు రగుల
నూది భూపుత్రి కోల్పోవు నోర్మి, యికను
జాగుచేసిన జీవరాశయు నశించు
ననియె యీ వియోగ వేదన యనుము హనుమ!

దాశరథికి బంధపాశము తెగద్రెంపు
కార్యమందు నండగా నిలిచిన
ఆ మహాత్ము వానరాధిపు, నాతని
వారి నడిగితిని శుభమ్ములనుము.

అదియ దురదృష్ట మల్పకాకాసురుని య
నల్పమా నలుమోమున్ని యస్త్రమున ప్ర
తాడనముచేసి యింతటి దారుణమ్ము
సైచి యెట్లూరకుండెనో శౌర్యమూర్తి!

చిత్రకూటమునందు వసించుచున్న
దినములవి, సాగె దివ్యజీవనము, మునుల
సంగతియెకాక పావనస్నాన కాన
నోచితాహారముల సుఖముంటి మపుడు.

ఆ మహేంద్రున కాత్మజుడంట చిలిపి
కాకి యాతడు నేను సుఖాన నార్య
పుత్రునొడి బండియుంటి నా మూర్ఖుడంత
కాకి స్తనాల పైపైకి దూకసాగె.

చీదరమ్మన హుష్షని చిన్ని గులక
రాల వైచుచునుంటి, పరాకునందు
నతడు మొలనూలు లాగ నావంత చీర
జార నాయన మొగమును గేరె నగవు.

నగుమోము గన్న నాకున్
తగనియలుకవచ్చి మీకు దగునాయని దూ
రగనైతి నాతడోదా
ర్చగ క్రమ్మర నొడిని నే ప్రశాంతిగ నుండన్.

నిద్రవచ్చె, రామభద్రుండు సైతము
నిద్రగూరినంత నీచమాంస
బుద్ధి కాకివోలె ముక్కున బొడువ ర
క్తమ్ము చింది రాముకనుల నిండె.

ఛీ దుష్టా! నిను సైచుట
కాదని దరినున్న బాలఘాసముతో సే
యూదిన బ్రహ్మాస్త్ర మతం
డేదారియు లేక రామునే శరణమనెన్.

నా ప్రాణ మమోఘము నీ
చా! జేలల తనువు కింత పోరాటమ్మా !
నీ బాబుసైత మింతియె
పో బుద్ధిగ బ్రతుకు బ్రతికిపోతివటంచున్.

నీ చూపు వక్రమయ్యెడి
ప్రాచీ నావిలి యటంచు పలుపుచు నిపున్
నై చెదపు వికిరపిండము
ఛీ ఛీ చెడబుట్టితివి శచీగర్భమునన్.

ఈ విషయము మా యుభయుల
కే విదిత మ్మార్యపుత్రుడిది వినిచినచో
నావల నీ చెప్పెడి వే
వైనన్ గ్రహియించు సత్యమేయని నమ్మన్.

అనిన నెపరికిగాని పదార్థమెదియు
చూపిన గల్గు తృప్తి సంతాప మడగు
భావమాత్రముతో ననుభవము రాదు
పదము నర్థమ్ము గూడుటే ప్రగతిపథము.

నిజమెయని సీత చూడామణిని నొసగి
తెలుపు నియ్యది యినవంశ తిలకులైన
అత్తమామల ప్రేమానురాతిశయము
నగలకెల్లను నగ ఎన్నదగిన ఎరుక !

అతని పాదాల నునిచినయట్టి మనమె
యగు శిరోభూష; యిచ్చోద నందుకొనుము
దీని గొంపోవదనుగాని దేహ మీవు
తీసికొనిపోవదగదు వైదేహి నేను.

నాయనా! యీ శిరోభూష నాయనకు నొ
సంగి నీ సంగతినిగోరు జానకి యట
వనటగుందుచునున్నది; వత్తువనుచు
ఒడలు కనులుగ చూచుచు నున్నదనుము.

ఎంతకాలమొ తాను భరింపలేదు
దేహమని తెల్పు నా తండ్రి! సోహమన్న
భావమున నిల్చియుంటిని రావణమున
బ్రతుకలేనని తెల్పు మారుతీ! మహాత్మ!

మారుతియు పొంగ నామె విశ్వాససుధలు
హృదయమున నిండె కంట సంపదలుపండె
చేత చూడామణింగాని చేతమొల్ల
రామునియనైన యతడు విరాజ్ఞుపషుడు.

"తనకంటె దగ్గరా! యీ
తని సంగతియేమొ ఉభయతారకమోయీ
హనుమా! నీవే సార్థక
జనిపని యాశీర్వదించె చనుమాయనుచున్.



# పదవ సర్గము

నచ్చనపని యైనది నే
వచ్చిన త్రోవన్ జగంగవచ్చెన వృథా
పుచ్చగదగ దవకాశము
చచ్చెర నే నరుగ నేమి చేసినయల్లా!

అను భావము పెంపున నా
హనుమ పెరిగి పెరిగి కొండయంతగ నతనిన్
గనువారల కంతక భీ
తిని గొల్పె నితండు లంకదీర్చునొ యనగన్.

సీతమ్మజాడ తెలియుట
ప్రీతికరమ్మె, యెవారు పీడించిరో ఆ
మాతను వారల వివరము
ప్రీతికరమ్మగును తనని వేదనకు దగున్.

ఏ యుపాయమునన్ గుట్టులెల్ల దెలియు
సామమన్నది యీ లంక శబ్దకోశ
మందు లేదింక దానమా యిందు లేని
యే కనకవస్తు వాహన మెందుగలదు.

ఇట నభిప్రాయ భేద మొక్కింత కేని
తలలు తీయుదురింక భేదమ్ము మాట
తలపబని లేదు, తగునిట దండనమ్ము
దానవుల కెన్న దండమే దశగుణమ్ము.

ఈ యశోకవనం బసురేశు కెంతో
ప్రీతిపాత్రము సైప డేరీతినైన
చెరపు; దీనిని జేయ నిశ్శేషమంత
నే నెవండనో తెలియును దానవులకు.

సేవకులు చెప్పెదరు పోయి రావణునకు
పొసగు నంతటితో ముఖాముఖిని భాష
ణమ్ము లెవరికి నెంతటి దమ్ముకలదో
తెలియు; నా పని వివరము దెలుపనమ్మ

అనుకొని యజ్ఞమునకు పా
వని ఓం భూర్భువస్సువ స్తత్సవితుః
అని ప్రాణాయామించెను
తనరూపు మహేంద్రపర్వతముగా దోపన్.

ఒక కొమ్మ విరిగెనా ఒక చెట్టు యొరిగెనా
పవనసూనుని తరుధ్వంసదీక్ష
వనదేవి యడలెనా వడకెనా గజగజ
అవనిజపట్లనా ఆ యుపేక్ష!
చెట్లెల్ల కట్టెలా సీతామహాసాధ్వి
కింతదారుణమా తమంతనీడ
అవని కూలెను బాధ కలుగుమెనోయెనా
[illegible] యమాకైన

చెట్టుకొక్కొకపక్షిగా జేసినైచె
నసురలెల్లరు నల్లాడ, నైదుతలల
పాములాయన చేతులు బారజాచి
ఒకరి పైపైకినెత్తి యింకొకరి బాదె.

చెరువుకట్టల దెగగొట్టె తరువులెల్ల
తెప్పతిరణాలగా నిండ్లకప్పులయ్యె
హర్మ్యములు నేలమట్టములయ్యె నుపవ
నమ్ములవి దొంగదోచిన సొమ్ములయ్యె.

శోకవనమయ్యె నంత నశోకవనము
ఇల యశోకముగానుండు నెల్లవేళ
ననుచు మాహాత్మ్యలెంచెదరదియ పరిణ
మించు శోకముగా శ్రుతిమించినపుడు.

పేరశోకమె అచ్చటిదాపులెల్ల
బ్రతుకుగతుకుల శోకమునైపె చూపె
చపలు డందముగాదీర్చు నుపవనమ్ము
కాచి రక్షించు దాని రక్కసులమూక.

అందముగదోచు బంగారు బందములకు
బ్రమయువారల కా యుపవనము నచ్చు
హనుమ దానినె యొక తపోవనము జేయ
పెళ్ళగించెను కూకటి వ్రేళ్ళతోడ.

పుడమిపుత్రికి సాష్టాంగపడినదనగ
ఉపవనము నేలముట్టుగ నొరిగిపోయె
అవనిజంజూచి దుఃఖించు నవనిజములు
కూలుటయె తలచెకాబోలు నేలటంచు.

పారెనంతట గుండెలు బాదుకొనుచు
ప్రబల రాక్షసతతి భయభ్రాంతమగుచు
రావణుని జేరె నార్తసంరావమొప్ప
భూ! అశోకము జెరచెను భూతమొకడు.

కంటబడె, గడ్డకట్టినగాలివోలె
అతడు హుంకారమొనరింప నా యశోక
మంత నోంకారమున ప్రతిధ్వానమయ్యె
కనులుమూసెను ధ్యానముగా నెవారి
నోజపించెను పిదప మనోజవుండు.

ఎప్పుడాత డశోకము నెక్కెనో యె
రుంగ మాతని పనులెల్ల దొంగచాటు
కదలి నెపుడెట్లు గడచెనో గాని చెడ్డ
గాలిగా కాలుపెట్టెను గాడ్పుకొడుకు.

సీత మాటాడె నతనితో, చెవులజెవుల
కొరికికొని రెంతగా మేము గోలపెట్టి
నను మెదల్చదు నోరు మీరనుభవించు
రింతకింతను, తెల్పదావంత మూగి.

నాకెట్లు తెలియు రక్కసి
మూకపనుల్ మూకయెఱుగు, మూర్ఖుండెవడీ
యాకారమునను వచ్చెనో
నాకేమియు దెలియదనె తృణప్రాయముగన్.

అన్నది యన్నట్లూరక
యున్నను బాగుండు; నెంత యుత్సాహమొ ! ఆ
పన్నులమముజూడగ న
న్నన్నా ! ఆ కోతి దయ్యమా భూతమ్మా !

పేరుకైనను నుంచక పెరకి చెట్ల
నన్నిటిని నేలగొట్టె నేమందుఁ; మంది
నట్టివారల నందినయట్లె చావ
మోదె నాయమ్మకదియ ప్రమోదమయ్యె.

పట్టుబోయిన చేతులు వట్టుదప్పు
అతడుపట్టిన నాయువుపట్టుదప్పు
సోకునందరి తనయబ్బ సొమ్మునట్లు
పోప నందరిప్రాణముల్ తీరినట్లు.

చురంచురంజూచు పటపటకొరకు పండ్లు
గుసగుసల నవ్వు తనవాడిగోళ్ళదువ్వు
సిగలుబట్టును గ్రద్దపన్నములట్లు
కోతిచేష్టయె ! అది మహాభూతచేష్ట.

ఊరకుండిన లంకయే యూంపెదన్న
యంత భీతిని పరుగున నందరమును
ర దలంపగ తోకతో మోదె, నచట
చచ్చిమిగిలిన వారము వచ్చినాము.

అతనిచూపుల నరుణోదయమ్ముతోనె
మింటమండెడి యరుణాగ్ని కంటమండె
మండుకోపాగ్ని మసలిన గుండెనీట
విభునిదేహము రక్తారవిందమయ్యె.

రావణుడంతట సింహా
రావమ్మొనరించి "సిగ్గుచేటగు నతడే
కోవకు జెందిన మాగటివి
చేవగలాడింక జాగుసేయక మీరల్.

పోవుడని రాటుదేలిన
సేవకులన్ చావుబోలు జితయుమభటులన్
రావించి జంబుమాలిని
గావించెన్ ముఖ్యు కాలకాలాంతకునిన్.

పనిమొన అనుకోను పనుపున
కొనసాగగ హనుమ అంతకులకంతకుడై
తనచేత నొక్కదూలము
గొని వారల చావచితుకగొట్టెను యముడై.

ఎంతటి దైత్యులను తమో
ధ్వాంతము వెలిబూదిసేయు నాదిత్యువలెన్
అంతకునంతకు డంత న
మాంతము స్వర్గానికనిపె నసురగణమ్మున్.

కనురెప్పపాటులోనే
హనుమయు నా జంబుమాలి యవిరళముగ వే
సిన యగ్నిబాణముల వే
సినయట్లే యార్పె దంతసిరి నురుగులతో!

జంబుమాలి సకలసైన్య సమేతుడై
మడిసెనన్నవార్త నొడయడెరిగి
ఇంద్రు డెత్తివచ్చెనేమొ యీరూపాన
కోతి కింతపనులు చేతనగునె!

ఎవ్వడైననేమి యీసారితో సరి
యనుచు సచివపుత్రు ననిపె సచతు
రంగముగ, నతండు రంగములో దిగ
నతనియాశ భగ్నమై గతించె.

హనుమ తానెయగుచు నంతటదిరిగె; ప
దమ్మమోప ధరణితలము క్రుంగ
పెనుతుపాను వీచెననగ నుచ్ఛ్వాస ని
శ్వాసములను జెరగె పవనసూతి.

చూచుకనులు రెండు సూర్యగోళమ్ములు
మృత్యుగహ్వరమ్ము మించు ముఖము
ఐదుతలల పాము లాతని చేతులు
దిగ్గజాంకుశముల సిగ్గు గోళ్ళు.

ఏన్గునెత్తి మరొక యేన్గును గొట్టెను
గుర్రమును మరొక్క గుర్రమునను
తరువులెత్తి తరిమితరిమి సైన్యమ్ముల
చావగొట్టె రామసేవకుండు.

రామనామజపవిరామము నెరుగడు
తల్లి చుట్టునే ప్రదక్షిణమ్ము
దైత్యహననదీక్ష దాక్షిణ్యమెరుగని
జాలికడలి హనుమ వాలకేళి.

సచివసుతు లందరురికిరి సంగరమున
శలభములవోలె హనుమాగ్ని సమసిరెల్ల
అంత దశకంఠు డనిబంచె నక్షతనయు
చచ్చియెవ్వరు క్రమ్మర వచ్చినారు !

ఆ మహేంద్రుని గెల్చిన యాత్మజుండు
మేఘనాథుడు శూరుడు మేరుధీరు
డఖిల శస్త్రాస్త్ర శాస్త్రవిద్యా చణుండు
రావణుని కండచేవయు ప్రాణమతడు.

ఆత్మభవు చేతిమీద బ్రహ్మాస్త్రమంది
నట్టి నిగమాగమమ్ముల దిట్టయైన
తనయు ప్రేముడి బిలచి వేదనముమీర
"నాయనా" లంకగాడు సుపాయమీవె.

ఒక్కవానరముంబట్ట నొక్కరొకరు
పదులు నూర్లేగి యట మిత్తివాత బదిరి
పట్టియాతని నట మట్టుపెట్ట నెంతు
గాని మర్యాద పాటించి మానుకొంటి.

పీడ విరగడ సేయగలాడ వీ వొ
కండ వాధారమైతివి కదలి కదన
సాగరము ద్రచ్చి యమృతమ్ము నొగిరముగ
నందుకొనుమయ్య మేరుధీరా కుమార !

అనిన పితృదేవు నానతి నా మహేంద్ర
జిద్వినయమహాత్ముడు సిద్ధమనియె
తండ్రి పౌలస్త్యుడంత చిత్తమున నాత్మ
ఆత్మజుండుగ రూపొందుననుచు పొంగె.

మేరుగంభీర నిస్వనామోఘ బాణ
తూణ ఘూర్ణిత గగనుం డతుల్య శక్తి
రౌద్ర ముద్రాంకి తోరగర్వాణిభుండు
ఉద్ధతిని నేగె పావని నూదివేయ.

రంగమున నురికినంత నిరంతరముగ
బాణములవాన గురిపించె, పవనసుతుడు
వమ్ము చేసెను మధ్యమార్గమ్ము నందె
వాలమున నాగి యింద్రజిద్బాణపాళి.

నగములు ఢీకొనునో, ప
మగు లొండొరుదాకి నుగ్గునుగ్గగునో, ప
మృగరాజులొత్తిరో, ప
న్నగములు పెనవైచు కొనునొ నా కదనమునన్.

ఇతడు గాలిమాత్రమేకద యని గాంతం
డతడు సీతిసుమాలెనని యింతం[illegible]
ఒకరిమించి యొకరినొక్కఁడు మించగా
మింద మించు దాకు మెరపు లారెసె.

అంతసైన్యము, సచివపుత్త్రాది వీర
గణము, తోఁబుట్టు వక్షుఁడు రణమునందు
క్షతిని బొందిన కక్ష దీక్షను రగుల్చ
నింద్రజి త్తైత్తుపై యెత్తు నెత్తి మొత్తె.

పిల్లంటయ్యు నితండొక
జల్లెడగా నస్త్రములను చల్లగ జార్చెన్
తల్లి యొడిలోన జేరెడి
పిల్ల [illegible] వేసినట్లు[illegible].

అని హనుమ తలచు సీతం
డనిసేయు విధమ్ము దానికదియే పోలున్
మును వీరుల గనమా యీ
తని నెవరే బోలుదురె కుతల సుతలములన్

అనిలుం డనలుండును జీ
వనుడు మన్ను మిన్ను కలసివచ్చియు నీ రా
వణసూతి దాకగలరా
యనిపించును. బ్రహ్మవిద్య యట్టిది కాదే !

హనుమ తలపోయుచుండినయంత నతని
తలపుదీపము మలచునంతటి యమోఘ
మార్మికాస్త్రము పడి యెదో మబ్బు కప్పి
మైక మలమిన మారుతి తోకముడిచె.

ఏజవము వీగ దతడు మనోజవుండు
ధీయుతుండగు వీరాంజనేయ యోగి
కాచి వడపోసి శాస్త్రము లాచమించి
జీర్ణమైనట్టి బలి, చిరజీవి హనుమ.

బ్రహ్మాస్త్రం బెదురైనను
బ్రహ్మవిదుం డెదిరియైన పని మునుకొన్నన్
నిహ్మాచరణమ్మే యగు
బ్రహ్మాస్త్రమునడుపు విధిగ పాటింపదగున్.

అదిగాక బంధితుడుగా
పదిమందికి నెదుట నిల్చి వచ్చినపని నే
మొదలంటి చివరివరకున్
అదనెరిగి వచింప నర్థమగు నాదుపనుల్,

ఆపిదప వారియిష్ట
మ్మాపద కొని తెచ్చుకొంద్రొ, అపరాధములన్
సైపుమని రామపాదము
పై పడెదరొ యెవరికర్మ వారిదిగాదే !

నేనిపు డేగెద నోడిన
వానిగనే; మాటపడిన వాడెవ్వండే
గాని చెడ, దచట వారలు
వైనం బెఱుగమిని ఏమివాగిన దెలియున్.

అనుచున్ మూసిన కన్నూ
సినయట్లై నటించె నష్టచేతనుగా త
న్ననుకొన ననుకొననిమ్మని
అనేక యోచనల లొంగె నాతడు తానై,



# పదునొకండవ సర్గము

రాజపుత్రుడు వనచరరాజువోని
వానరుని గూల్ప హరహరా ! పశుపతి ! కపర్ది !
అనుచు రంకెలు వైచుచు నసురవృషభు
లంగవైచిరి నందిమృదంగమునకు.

ముదము పేర్చేగ నసుర సమూహమెల్ల
తలకు నొక్కొక్కయూడ నాతనిని గట్టి
రద్ది బ్రహ్మాస్త్రమోపమి బుద్ధిలేని
వారికిం దెలియునే ! కార్యకారణములు.

దేహబంధనములు బ్రహ్మదేవు నస్త్ర
మునకు తలయొగ్గువానికి మోక్షమొసగు
తనువు నసురులు బంధింప హనుమమనము
స్వేచ్ఛమయ్యెను బ్రహ్మాస్త్రచేతనమున.

ఈ రహస్యము విజితమహేంద్రుడైన
పారజూడడు విజయగర్వమున జిక్కి
విడుదనని విర్రవీగెడి వేదవేత్త
రావణుండేమి తెలియును రామమహిమ !

తేరుకొని కన్నులన్విప్పి పారజూచు
నతడు కోతిగ దోచె మూఢాత్ములకును
[illegible]భూతములకు రాత్రి జ్ఞానిపవలు
అతని రాతిరి యిల మూఢమతుల పవలు.

అట్లు బంధితుడైనట్టి హనుమ నొక్క
వింతజంతువుగా రాజవీధులందు
గొంచు బోయి రూకేగింపు కొలుపువోలె
వింతవింతగ నతడు కన్పింపసాగె.

ఆకాశమంటు హర్మ్యములనాతడు చూచు
చిన్నచూపున లంక చిన్నవోయె
గోపురమ్మున నగ్నకోమలుల్ సిగ్గుతో
రాసడిపోయిరా చూపుజూచి
బూతుబొమ్మల జిక్కు కోతికళలకు తాను
కోతియయ్యెను మది క్షోభనందె
లలితగానకలాప చలితుడై విలపించె
గాలికింబట్టిన గతి దలంచి.

కోతి కోతియన్న కూతలు విన్నంటి
చిలిపితనము గూడ చేష్టదక్కె
ఇంత చచ్చి చెడియు నీకోతినాపట్టి
రనుచు నవ్విపోయి రబలలెల్ల.

వానరము చిక్కెనను శుభవార్త యొక ము
హూర్తమున దెలిసె; నంత మహోత్సవమ్ము
చాటె లంకాధిపతి రాజసభను బిలిచి
కొడుకు శౌర్యాని కదరెను కుడిభుజమ్ము.

అనిగూలె రెంద రెందవో,
చనె నక్షకుమారుడైన సంతసమున రా
వణునెడద పొంగె తనయుని
పనితనమున తండ్రి చల్లబడుటబ్బురమే !

వీరోచిత మర్యాదల
నా రాజకుమారుడేగి యభివందన నో
రారగ నర్పించిన నో
టారగ తండ్రియును బల్కె నభినందనముల్.

పట్టితెచ్చిన కోతికి నెట్టిగారత
వేయదగునో నచింపుడు విజ్ఞులార !
ఈతడెవ్వడో వచ్చిన దేకతమ్మొ
తెలిసి పిమ్మట నేదేని సలుపదగును.

అనిన నందరు గొల్లుననరచి, రావ
ణుండె నీరవముగ నట్టులుంట, జడిసి
మూగలైనంత భీకరమూర్తి మంత్రి
కనియె కనుగొను మీతనికథ యదేమొ.

మీ మీ మనసుల మసలెడి
ఏ మాటయు దాచవలదు స్వేచ్ఛగ తెల్పుం
డీ మాయకోతి చేసె న
సామాన్యంబైన దుష్టచర్యల ననినన్.

తలగోరుగు డనియె నొక్కఁడు
తలనరకుడటంచు నొకడు తలయే కాదా
తల తోక నరుకదగునని
తలతోకయు లేని యెన్ని తలపుల దెలుపన్.

మంత్రియనియె యితనిమాట యదేమొ ముం
దుగ వినంగనగును; తోకయున్న
నరుడు కోతి, తోక నరుకంబడిన వా
డెట్టిగుట్టు బైట పెట్టడేమొ!

వానరాధము తెల్పు మెవ్వారలైన
బంపిరా నీవె వచ్చితివా యటన్న
చిన్నమూపున కతడు పెంచినది పెంచి
నట్టు వాలమ్ము నొక పెద్దగుట్ట చుట్టె.

సింహాసనమ్మునే సింహావలోక న
మ్మొనరింపదగినంత యున్నతముగ
ఒదిగి కూర్చున్నవాడెదుగ నాశ్చర్యాబ్ధి
నోలలాడుచునె బెంబేలుపడిరి.

హామమయు విభ్రాంతుడై దైత్యవిభవమ్ము
కలరెనో యడలెనో కలయె గనెనొ
ఈతని క్రీడానె యింద్రుండు చంద్రుండు
గ్రహాగతు లితని వీక్షణపథాన.

ఇతడు ధర్మమునే యాదరించునెడల
రాముననంతటివాడు సుత్రాముననంత
వాడుగా జగతి లేకుండు నీడుజోడు
విభవ మశుభమ్ముగా వె దుర్విధిపథాన !

వానరులలోన మాత్రము వాలి నెఱుగ
మా ! యెఱుంగము సుగ్రీవునంతవాని
ఇతనిదా నేదో విపరీతగతి; తలంప
మాయకాడయ్యె దోచు నమాయకునిగ.

ఎదిగె జెత్తెడు, జానెడై యెదిగె, మూరె
డయ్యె బారెడుగానయ్యె నంతలోనె
చూచువారలు కన్నులబూచి దులిపి
తిరిగి వీక్షాగ్రముగ జూచి వెరగుపడిరి.

అంత కోతికి కొంతమర్యాద కలిపి
అన్రెప్రహస్తుడు కపిరాజమా ! పురంద
రుండు పంపెనా ! బాణాసురుండు పంప
వచ్చినాడవా ! అసలేలవచ్చినావొ !

ఈయ శోకము శోకము జేయ నేల
మృత్యుగహ్వరమున నిట్టులేల తెలిసి
తెలిసి జొచ్చితి చెప్పుము తేటతెల్ల
ముగ సహింపరు ప్రభువులు మూగినున్న.

పవనసుతుడు స్పష్టవాక్యపద్ధతిదోప
ననియె నేనడు నన్ను నంపలేదు
చూచిపోవుదమని తోచగా వచ్చితి
లంకయేమొ దానిరంగులేమొ !

ఒక్కయూపుననె పయోధి లంఘించితి;
కాని చూపె యొక్కగడుసుకత్తె
కాపు లంకిణియట; కాలడ్డి పిదప త
నంత పోయిచూడు మని వచించె.

వచ్చి చూతునుగద వనమున శోకార్తి
గుందు కోసలేశు కోడ లవని
జాత మైథిలి యమదూతల బోలిన
వార లామె గాచువారలంట !

చెప్పెదను వినుండు శ్రీరామ సుగ్రీవు
లనుప వచ్చినాడ; హనుమ నేను
వివర మరసినాడ పవనాత్మజుడను మీ
బాగు దెలియ జెప్ప బట్టువడితి.

కాంచినాడ త్రిదశకాల దశగ్రీవ !
మూడెకాల మెదియు జూడలేవు
అవనిజాతనా మహాపతివ్రతనా వ
పెంచి గొప్ప మోహాపంచితమువు !

బుద్ధిగలిగి దేహశుద్ధి నివారించు
కొనుము; నాదుమాటవినుము మూర్ఖ!
తప్పు నొప్పుకొన్న దయనేలు శ్రీరామ
విభుడు ధీరు డాత్మవిభవమూర్తి!

వినకయున్న నేమిపని యానొ చూపంగ
దలచి యుపవనమ్ము గొలిచినాడ
పిరికివాడ! కడుపుచెరచంగ పుట్టెద
రిట్టితనయులు దురదృష్టవతికి.

అవిన రావణుడంత నేత్రాగ్నిశిఖలు
ప్రజ్వరిల్లగ నావు నీప్రల్లదములు
చేయదగుపని నీశిరచ్ఛేద మొండె
కోతినీతుల నింకను గూయబోకు.

ఆదశగ్రీవు డట్లన ననుజు డో ప్ర
భూ! యెవండును దూతకు వేయరాని
శిక్షయిది; ధర్మశాస్త్ర విచక్షణుడవు
ధూతపాపుడ వగుమని దూతచెప్పె.

పాపమ్ము పండలేదో
నీపున్నెము లింక నింకనేలేదొ ప్రభూ!
జాపిన మైత్రీహస్తము
నేపూనుము; కాదటన్న నిర్వంశమగున్.

కోరివచ్చిన పడతులు నూరునూర్లు
యక్ష గంధర్వ కిన్నరాజ్ఞాక్షలింక
తాలిగట్టిన ముక్కంటినాలి వోని
స్త్రీవిభూషణ మందోదరిని దలంపు.

అను విభీషణు పలుకుల కాగ్రహమున
"సోదరుడవను చనువున శుష్కనీతి
పాఠముల నేకరువు పెట్టవలదు; తమ్ము
డై యెవండును బోధచేయంగనగునె!

లంక నెవరుగాని రావణుచర్యల
కాదనంగనోప రీ దరిద్ర
భీరునీతి నీ విభీషణు నోటనే
వినగవలసె, వింటి, వినగబోను"

అయిన సీతడు వచియించినట్టి దొకటి
యుక్తియుక్తమె; యీతని యోగ్యమైన
రీతి దీరిచి పంపిన ప్రాతిపదిక
వేసినట్లాను; వీని నివేదనమున.

గాని వారలు లంకకు కదలిరాదు
ఈతడిట ప్రాణముల్ వాయ నెవరుపోయి
ప్రీతి కాటుక బొట్టునుబెట్టి పిలతు
రందుకని వీని తలదీయు నదను వే^ం.

శివధనుర్భంగమను తోక సీత గట్టు
కొనియె సీతని యజమాని; కొల్లవోయి
వానరుల జేరె నరుడు విపన్నుడగుచు
కాక నర వానరాళికి తోక ప్రియము.

నరుల జూడమె ! తమతమ నామములకు
తోక తగిలించుకొనువారు దొడ్డలమని
విర్రవీగుచునుందురు, వీరి తోక
కాల్పనా యను రావణు కరుణచూచి.

హనుమ తలపోసె నింకొక యత్నమింక
నొక్కయత్నము జేసెద నున్న వేటులు
నున్న దది మాత్ర మెన్నడు నూడిపోదు
కద్ద యిటకూడ గలడు విభీషణుండు.

ఆంజనేయుడు సభకెల్ల నంజలించి
పుణ్యజనులార ! మీ పూర్వపుణ్య మేమొ
లంక ధగధగ వెల్గు ధరాతలమున
ఇంత సంపన్నమౌ భూమి యెందుకలదు.

కామేశ్వరుంగొల్వ కామమీడేరక
కామరూపత్వమున్ గాంచితీరు
మీధాన్య ధనరాసి క్రోధమునే పెంచి
పగసెగ రేగి కుప్పలను గాల్చు.

దానమ్ము లిచట సాధారణమ్ముగ లోన
దాగు లోభమునకు దర్పణములు
రాత్రిసైతము నిద్రరానీయనంత వ్యా
మోహాన పెరిగె ద్రోహబుద్ధి.

ముదము లిన్నియొకట మదమును బెంచ మ
చ్చరము పెచ్చుపెరిగి తరుగులేని
పృథ్వి దరిగె నొకవివేకమే; యీ లంక
శాంతిలేని కనకకాంతభూమి.

అమ్మవారి యందు మనుగు పుత్రునివోలె
గొలువదగును; కన్నుగొట్టులంక
కొలువదగినచోటు విలువల నెఱగక
వలచు చపలచిత్తకులము మీది.

పురుషు డింటలేని తరుణాన నబల బ
లాత్కరించి తెచ్చు నవదవయ్య
విరవీగుచుందు వేదవేత్త నటంచు
తలలు పదియు వెర్రితలలు గావె!

దశకంఠ : నీవు నీదు
ర్దశ కొనితెచ్చుకొంటి; తల్లిని వలచున్
పశుగణము బుద్ధిలేమిని
వశికాని నరుండు పాపవార్నిధి మునుగున్.

వలచు కన్య నెవరు వలదన్న నెత్తుకు
పోయి పెండ్లియాడబోలు గాక
ఇట్టులైన యింటి యిల్లాలి వంచించి
తెచ్చు టసురులైన మెచ్చబోరు.

నీతివంతుడనను నీదు కోతలెల్ల
చేతమునబుట్టు తలపుల చిలిపితనము
వలచ నెవ్వరినే బలవంత పెట్ట
మనసు మరయానె! అన్యులు మలచదగునె!

ఆమె వైదేహి, శ్రీరాము ననుగుపత్ని
దేహమే సర్వమనుకొను మోహవశుని
కామతత్వము తెలియగనౌనె! మూఢ
మనసుపడు తలపుమలుపులు మాయకాదె!

తనువు భోగమ్మునకును సిద్ధాంత మొకటి
వలయునా దానికదె మొగ్గి పగలబడును
దాని నియమించు యోగము మాని పథము
ఆ పథము పుణ్యజనులకు కాపథమ్ము.

చిలిపి తలపులు ప్రాయశ్చిత్తమందు
చేరి చేయించు నీ దుష్టచేష్టలెల్ల
శ్రుతులు శ్రుతిదప్ప; విస్మృతి స్మృతులు సెడును
చేతనము మరల ప్రాయశ్చిత్తమందె.

తపము లేక జగతి ధర్మమ్ములేదు ప్రా
జ్ఞుల తపమ్మె కార్యశూరతయగు
పాపమాచరించి పదపడి తప్పులె
దిద్దుకొనుట అదియ తెలివితీరు.

చేయగూడని పని చేసి ఆయధర్మ
ముననె ధర్మము వల్లించు మూఢమతివి
లంక బ్రహ్మణ్యులేలేరొ ! రావణునకు
దెలియజెప్పరొ ధర్మము తీరు లేమొ.

ఇప్పటికినైన మించిపోయినది లేదు
ఆ మహాతల్లి మనము నీయందు లగ్న
మగుట రాత్రించరస్వప్న మా మహాత్మ
శరణువేడుట పాపసంతరణ పథము.

అను పవనసూతి రావణు
ననలమ్మున కనిలమై విహాయస మెల్లన్
కణకణ మండెడినో యన
దినమణి మధ్యాహ్నకోపదీధితు లుమిసెన్.

# పన్నెండవ సర్గము

ధర్మచర్చల నల్లించి తనువు నిల్పు
కొనగ నెంచినగూడ నీ మనసు మార్చు
కొనుట యుక్తము, కొని తెచ్చుకొనకు చావు
మంద! శ్రీరాము డతిలోక మానవుండు.

ఖరదూషణసైన్యం బొక
పరి యొకబాణముననె పరమపదించెన్
నరవరుడు గుట్టుగా వా
నరముఖ్యుని వాలి నింద్రనందను గెడపెన్.

రావణా! నీ బుర్ర రామకీర్తనపాడు
సుగ్రీవు డాదివ్యసూనుడు, నల
నీలాంగదసుషేణ శాలాక్షిసదృశ యో
ధాను యోధులదాడి ధరణి దద్ద
రిల్లు; లంకయ దెంత! రీతి నీతియు లేని
మూక నమ్మిన నీవు మునిగిపోదు
వీయాశ్రితులు నిన్ను నేమనజాలని
గంగిరెద్దులు చేతకానివారు

ఇంతి మనమును బలవంతమ్ముగా నెవ
రెప్పుడైన నాహరించినారొ!
వేదవేత్త వీవు విదుషాంవరుడవును
నపులపాలు చేయనా కులమ్ము?

ఎరుగక చేసిన తప్పులు
సరిచేసికొనంగనగును సరసుడవగుచో
పరమార్థము నెరుగని నీ
మురిపెమ్ములు కాల్పనా విమూఢ తపస్వీ !

ఇంతమంది సపత్నుల నెట్లు మెలగు
చున్నదో సాధ్వి ! మోహసంక్షుబ్ధమైన
కాపురమ్ము జగత్పతి ప్రాపునెంచి
ఆ పతివ్రత సాగించుచనని తలంతు.

ఆత్మజ్ఞానమ్మె సం
ఘాత్మకు పరిపుష్టి; స్వార్థకాముకులగు పా
పాత్ముల యుపకృతులున్ సం
ఘాత్మకు ద్రోహమ్మె దుష్క్రియాంతము లగుటన్.

తనువు దీర్చెడి మనమున ధర్మ ముప్ప
తిల్లు; ధర్మేతరములను దీర్చు వనమె
తనువుమాత్రమునకునైన ధర్మమనుట
తగదు; ప్రేరణయన్నది తనువుతీరు.

ప్రేరణలగాక మనము శరీరములను
తీర్చిదిద్దుట ధర్మముతీరు; నీది
పాశవికమైన యీ దేహబంధనముల
ధర్మమని నీతియని చాటు తప్పుత్రోవ.

వ్యామోహావశుల నీ శ్రీ
రామైకసమస్త సాధ్వి రమణించునె! సు
త్రామాదుల గెల్చితి గా
నీ మనమ్మును గెలువవైతి నిరయపదార్థీ !

వేదమ్ముల జదివితి పిడి
వాదమ్ములకా అశాంత వార్నిధిబడి నీ
వీదెద వర్థము తెలియని
వేదములన్ వల్లెవైచు విద్యాగర్వీ !

పొరపడుట సహజమే భూ
సురుడైనన్ నరుడె; యింత చోద్యముగా నా
పొరపాటు తెలియజెప్పిన
సరిబాటంబడమి రాక్షసము తామసమున్.

మరల వాక్రుచ్చుచుంటి ధీవరుని శరణు
వేడి మర్యాదపాటింపు; వినమి సపరి
వారనాశము తప్పదు; పండితుడవు
బ్రహ్మకులమందు బుట్టిన రాక్షసుడవు !

వేలు లక్షలు రాక్షసవీరు లంద
రందరున్ నన్నుమించిన యట్టివారు
దాశరథి పూన్కి యతని కోదండశక్తి
తెలియవో నీదు చదువులతేట యేడ !

కామవశుడైన రాజును కాలదన్ను
ప్రజలు ప్రాజ్ఞత నాజగత్పతికి ప్రజలు
చేతులెత్తెడి చవటల జేర్చి దీని
రాజసభయంట చెల్లె నీ లంకయందె.

జరిగిన యపకృతి నెంచియు
నరవరు శౌర్యమ్ము నెంచి నానావిధ వా
నరశక్తి నెంచి మోహము
పొరపాటును దిద్దుకొనుము పుణ్యజనేశా !

ఇంతదూరము తెల్పితి నింగితజ్ఞు
లైన తజ్ఞులు తెలిపెదరంచు, నచ్చ
కున్ననున్ నాదుమాటలవిన్న సభ్యు
లైన వారికి మనసార నంజలింతు.

అనివచియించున రావణు
ననుజుండు విభీషణుండు హనుమ హితములన్
అనువాదము చేసెను రా
వణునకు నహితమ్మె బోధపడె కృతబుద్ధిన్.

ప్రారబ్ధ మనుభవింపక
తీరదు దనుజుంకు తానుతీర్చిన బాటన్
బారెడి నెవడే గమ్యము
చేరిన కృతకర్మబద్ధ శీలము నశంపున్.

విధివిర్ణయ మనుకొని యొక
పథమునబడి జీవి చేయు పయనము తనకున్
వ్యథ కలుగ క్రుంగెడిన్ దు
ర్విధి యని సుఖమబ్బ విర్రవీగుచు పొంగున్.

అనుజు బోధలలో చచ్చుదనముతోప
దనుజుడంతట హనుమ చేతలను దలచి
దూతమాత్రుడటంచును కోతియనుచు
నీతి పాటించి వదలగ నిర్ణయించె.

అయినన్ పాపిని దుష్టున్
దయతలచుట తప్పు; యుక్త దండనమున నే
నయమార్గము కొనసాగును
వేయు లస్థానమున దప్పు; దండనమొతగున్.

ప్రీతికరమైన మనము నీకోతి చెరచె
కోతులకు తోకయన్నవె ప్రీతి కాన
నితని తోకకు నగ్గినంటించి విడువ
నదియ రాజుకొనున్ పర్వులందుకొనగ.

మనమేల జంపవలె నీ
తని దౌష్ట్యమె యితనితనువు దగ్ధముసేయున్
అను దనుజేశుని యాజ్ఞయె
ననుసాక్య మటంచు వాలమంటింపగన్.

సేవకులు పరుపులెత్తిరి
క్రోవన్ గనపడిన గుడ్డతునకల నెల్లన్
ప్రోవుగ స్నానెల ముంచిరి
దావానల మడవిగాల్చ దనిసెడి దనుజుల్.

ఆయకార్యము జూచిన యవనిజాడ
కనులవారిన కన్నీట హనుమ శోక
తడిసి ముప్పందుమయ్యె. చిత్తమున చిత్త
జల్లువడె, తనువు చలువల నుల్లసిల్లె.

శోకలంటిన స్త్రీలకు, శోకలంట
వానరములకు; నలుక కవ్యముగ హృదయ
సాగరముద్రచ్చి విసములవాగు సాగి
జగము ముంచెత్తి మోయుపన్నగము గలచు.

వారలంటించు మంటల వారిజాక్షి
వగపు మాపెడి రామసేవకుని వాల
మునకు నవనీతముగ చల్లదనములీనె
హోతలన్గాచు నగ్నిహోత్రమ్ము సతము.

లంకపాపము పండె; నిశ్శంక హనుమ
ఊపిరింబీల్చి చేతులనూప దేహ
బంధములు చేతనాగ్నికి నింధనముల
వోలె ముడులయ్యె నొక మల్లెపూలదండ.

దహనమది మల్లెమొల్లళ తావులీన
కముకుకంపుగ రోసె రాక్షసుల ముకులు
హననదీక్షితులకు రోత హవనదీక్ష
పండ్లుసొక్కునె నరమాంస భక్షకులకు !

లంకజూచితి రాత్రివేళను, సమగ్ర
ముగను దర్శింప సమకూడె తగిన సమయ
మంచు పావని కొంప లంటించుకొనుచు
దూరముల గాల్చె స్వైరవిహారమునను.

ఫక్కున నవ్వెన దనుజులె
కుక్కలు మొరిగినవిధాన కుయ్యో మొర్రో
ఎక్కడికోతియొ మాకుం
దక్కవు మాకొంపలనుచు దగనేడ్వంగన్.

ఇకిలించు హనుమ కండ్లన్
చికిలించును తోకనెత్తి చేపట్టుచు నొ
క్కొకటిగ కొంపల గాల్చెను
తెక తెకలకు మ్రగ్గిరెల్ల స్త్రీలు పురుషులున్.

సీతమ్మ కంటిచిచ్చే
కోతిగ లంకను దహించె కోర్కెలుమండెన్
చేతులుకాలిన నాకులు
చేతంబట్టిరు వినష్టచేతస్కులిలన్.

లంక వెలుగుచుండె శంకల పొగమబ్బు
లెగసె నుండలుండలుగను చదల
మింటివెలుగుకన్న మంటివెల్గులు మిన్న
యనగ మేల్మిపండె నవనియందె.

చేయదలచినపని ముగిసినదికాని
తుదిని మదిలోన సందేహ మొదవె; నింత
దహనకాండ నొనర్పగాదగునో ! క్రోధ
మొంప దుష్కృత్యములను జేయించునదిర !

ఇంద్రియార్థములంగాల్ప నేమియగును
భవనములు సుపవనమ్ములు వస్త్రభూష
ణాదులెల్లను భోగ్యమ్ములగును, భోక్త
దృక్పథము కట్టు విడుపుల దీర్చుచుండు.

ఎంత చదివిన నేమాయె యెంత తపము
లాచరించిన నేమాయె ! నదుపుచేసి
కొనగలేనైతి మనమును, క్రోధమునకు
లొంగిపోయిన వ్రతదీక్ష భంగమొకద !

అదిగాక దహనకాండన్
దుదముట్టెనొతల్లి ! అట్టి దుందుడుకుననే
పదిలము కుదురును ? కార్యము
వెదకుట ! నాకృతములిట్లు వికృతములయ్యెన్.

ఏమొనరింపగనైనన్
నామొగ మెటుజెల్లు కిశనాథుండే (శ్రీ)
రామునకుం దెలుపగనల
స్వామిద్రోహమ్ము చేసె పావని యనుచున్

దేహమును వీడె నిచట వైదేహియన్న
ఆయయోధ్యయు మిథిలయు నట్టువోలె
నుడుకకుండునె ! యింత చొప్పడెను రామ
సేవకాగ్రణి మారుతిచేత నకట !

వాలిగడతేర్చె వారసత్వమ్ము గూర్చె
ఆలుబిడ్డలజేర్చె సూర్యాన్వయుండు
మిత్రుడుగ సూర్యసూతి పంపించె రామ
పత్నిజూడగ కాలిచివచ్చె బంటు !

వారలంటించునప్పుడు వాలమునకు
తాపమే లేదు నీరెండ తగిలినట్లు
ఇద్ది యాదేవి కృపగాక యేమియగును !
అగ్నిదహియింపజాలు జ్ఞానాగ్ని తల్లి.

కన్గొసెగ లంటునే తల్లి కాయమునకు
ఆనిరింధనవహ్ని కేయగ్ని కాని
అంటినంతనె యూరు నాయమయె కాల్చి
వేయు నేయగ్నినే నింక భీతియేల !

ఆమె గన్నులగన సందియమ్ము తీరు
ననుకొనుచునుండ హనుమకు నాత్మబోధ
యయ్యె నాయమ కుశలమేయనుచు నైన
గన్నులారగ జూచిన తెన్ను వేరు.

శింశుపావృక్షమెక్కి దర్శింప పుడమి
పుత్రి కన్పించె కడిగినముత్తెమువలె
విషయవాసన నశియింప విగతమలిన
దర్పణమునాగ దోచె నాతన్వి తనిసి.

తనువు పులకరింప హనుమ సాష్టాంగము
గాగ మ్రొక్కి సెలవు నీగదమ్మ
మాతరో స్వభావమహిమ తెలియుదు వేమి
చెప్పగలను సైపు తప్పులెల్ల

లంకగాల్చకముందు ఉల్లమ్ముగాల్చె
మంట లద్దాననిద్ది యేమాత్రమగును
దానవము సైచిపట్టి యీధరణి గాల్చె
నెంచియున్ తల్లియని శ్రుతిమించనైతి

అనిన వైదేహి ధన్యుడవయ్య హనుమ
ముందుసాగుము యత్నమమందమైన
యోగి పయనించుబాట ఫలోన్ముఖమ్ము
నాడుకన్నుల జానకీనాథు గనుము.

శుభమెకల్గెడి సింహకిశోరమెట్టు
లడవి భీరుల స్వైరవిహారమోర్చు !
వానరము లింతతోసరి స్వచ్ఛమైన
బ్రహ్మ జరియింపుమో సదాబ్రహ్మచారి !

చిలిపిచేష్టలు నీవిగా దలచు నాప్త
వాక్య వాచ్యార్థపరులైన పండితులకు
హనుమ గుణపాఠమయ్యెడి ననఘురామ
సేవనమె జీవులకు దివ్యజీవనమ్ము.

ఈపానశాల, కాంచన
గోపురముల అక్షశాల, కోమలితనువుల్
జూపెడి నగ్నాలయమున్
బాపుత్తు నరవరునిసేత; వానరమెల్లా !

కావరమును బెంచుటకై
కావలెనే లలితకళలు ఖడ్గములు కళల్
ఆవేశమ్ముల బెంచిన
చేవసెడును బ్రతుకుసెడును చేతనముసెడున్.

వీనిని మట్టముసేయక
మానవతకు జోటులేదు మంచియె నీమూ
లానంజరిగెను సంతో
షాన నరుగుమయ్య శుద్ధ సాత్త్విక తేజా.

సాధకుడు తనువు మలచిన చందమయ్యె
నీవు లంకనుదిద్దుట; భావగమ్యు
డైన శ్రీరాము డరుదెంచి యసురగణము
నదుపు చేసినగాని నే గదలిరాను.

అన్ని యెరిగిన మీయయ్యకన్న నీకు
నాకు నెక్కుడు తెలియునే నయభయాల
నేయుపాయముచే నాత డీయసురుల
శిక్ష సేయునో ధరణిజారక్షకుండు !

కన్నతల్లి మెచ్చుకొన్న సంబరపడు
చాలునట్లు గంతువైచె హనుమ
రామభద్రునెంచి లక్ష్మణునెంచి సు
గ్రీవునాజ్ఞ నాత్మకృతము దలచి.

అతడసంఖ్యాక వానరయుత మహాచ
మూసమూహముతో లంక ముంచియెత్తు
భయదభల్లూకనివహ విస్ఫార వీర
పౌరుషమ్ముల నాసురబాధ దీర్చు.

కాంతకన్నీట గనుగని కఠినహృదయు
లేలు రాజ్యములవి గంగపాలుగాక
నిలచునే కానికాలము దలచి యోర్చు
కొనుము నావందనమ్ములు గొనుము తల్లి.

వీడి నేనేగవలసినవాడ నగుట
సెలవుగోరెద నాయెద నిలచుతల్లి !
వదలిపోవగ పాదముల్ పాదపములు
భక్తిపీయూష వితరణ పద్మపాణి !

ఆ దయార్ద్రిని కృప నాకు మీాదు దర్శ
నమ్ము ప్రాప్తించె, సకల భాగ్యమ్ములొదవె
అతడు సుగ్రీవుడే తల్లి వెతుక బంపె
హృదయతంత్రుల మీాటి శాసించునతడు.

ముందు కర్తవ్యమునకు నామోదముద్ర
నిమ్ము మాతా ! భవాబ్ధి తరింపనిమ్ము
తల్లి పంపించెనని పోదు తండ్రికడకు
అతడు గుర్తింప నన్యసాక్ష్యమ్ములేల !

అని చూడామణి చేతం
గొనిచనె వాలాగ్నినార్పుకొనె జలధి వినూ
తన చేతన దనరగ చ
య్యన నెక్కె నరిష్టవర్వతాగ్రమ్మునకున్.

పాదహతి నా యరిష్టపర్వతము నేల
మట్టమై గుండమేర్పడె మొట్టమొదట
నచట నుండె నరిష్టమటన్న నిజము
కల్లకాబోలు ననిపించె కలగదోచె.

ఆ యరిష్ట గుహావాసమైన క్రూర
సర్పములు విసముగ్రక్కుచు సమసిపోయె
క్రూరజంతువు లెల్లను బారె వెలికి
ప్రాణశక్తికి భువి నసంభవము కలదె!

గంధమలదియు నితరులకంట బడక
మందపవనము తనయు నానందమయ్యె
జలధి లంఘింపబడె నొక్క క్షణములోన
అబ్ధి హనుమాగ్ని ప్రభవించినట్టిదె కద!

భూతములు వెరగుపడి నిల్చిపోయె, తరువు
లట్టె నిలబడె, నుప్పొంగి యాకసమున
నెగిరె పక్షులు, దైవము తగిన శాస్తి
చేసె నసురులకని బారె జీవనదులు.



# పదునాల్గవ సర్గము

అది మనోవేగ, మయ్యది హనుమ పవన
వేగ, మద్దాని వర్ణింప వేయితలలు
వేయినోళ్ళును వెనుకాడు; కాయమెంచు
సాధకుల మనము రూపొందు స్వానుభవము.

కనిగిరి హనుమ యొనర్చిన
నినదమ్మున నచలకదలె నింగియు గర్జా
ధ్వనిగుణకమయ్యె నయ్యది
విను జాంబవదాదికపులు విస్మయమందన్.

మన హనుమ వచ్చె విజయ
ధ్వని యదిగో కాంచెనతడు ధరణిజ విశ్వా
మ్మున నంత పౌరుషధ్వని
వినబడు భవదూరు నాత్మవిశ్వాసమునన్.

ముడుచుకొనినట్టి తోకలు పొడవుసాగె
సడి యడంగినచోట సందడులు రేగె
పెడమొగములైన కపివీరవితతి మూగె
చల్లబడినట్టి పౌరుషమెల్ల కాగె.

తోకలెత్తిరి త్రొక్కుకొనుచున్
మూకగా పరుగెత్తిరి
పీకలోపినయంత సవ్వడి
నేకముగ నెలుగెత్తిరి.

రమ్ము హనుమా జోతలను గై
కొమ్ము హనుమా స్వాగతం
అమ్మజూచు ప్రతిష్ఠ కపిలో
కమ్మునకు దక్కెన్.

కడలి దాటితి పంటబోదెను
గడచినట్టులు, గంగ కా
ల్నడల దాటినయట్లు నీకె
వ్వడు సమానుడగున్.

దారులన్నియు జూచితివి పరి
వారమును సంసారపారా
వారమును దాటించి తిన్నని
దారి దీర్పంగన్.

అమ్మ జూచిన కనుల మాయకు
మల్లెయుంచుము గుణనిధీ!
తనివి తీరగ నీదు కనులన్
గనెద మమ్మను ధీనిధీ!

గగనమ్మున గరుడునివలె
నగపడి దిగివచ్చె రాజహంసగ నిపుడా
నగజాపతియంశగ మా
కగపడు కేశర్షభా! శుభాంత మనస్వీ!

ఆగిన రథములవలె పే
ర్చేగిన వేదనల నంతరిక్షమున న్నీ
వేగిన పథముల జూచుచు
మూగలవలె బ్రతుకుబరువు మోసెడి మాకున్.

బాగోగుల దెలుపుము నీ
వేగతి దాటితివి కడలి, యెచ్చట నెవ్వం
డేగతి నీకే మొనరిచి
రాగాథను తెలుపుమయ్య ఆద్యంతముగన్.

సీత యగపడెనన్న యాకూతి మృత్యు
భీతి నడలెడి బ్రతుకుల బ్రీతి పెంచె
పోవుతరి యుసురుల గొనిపోయి తిరిగి
వచ్చి మాయంతరంగము జొచ్చితీవు.

ఆ యమ్మ దేహమును గొం
పోయిన మూఢాత్ముడెవడొ పుణ్యస్త్రీని
ర్లేయథముడు బంధించెనొ
ప్రాయము తుదముట్టగోరు వాడెవ్వండో !

తెలియం జెప్పుమటంచును
బిలబిల నటమూగ కర్ణపేయముగా వ
త్సలతన్ హనుమ వచించెను
తలలూపుచు మిత్రకోటి తనిసివినంగన్.

ఆ మహేంద్రనగము నారీతి నూతగా
కడలిగడువ సిద్ధపడిన నాకు
మధ్య నడ్డుతగిలె మైనాకమను పక్ష
రక్ష చేసికొన్న రాక్షసగిరి.

నాకు బ్రియముగూర్చ నాయనా! ఒక్కింత
తడవు సేదదీరి తనువు స్వస్థ
మైనపిదప వెడలుమయ్యా యటంచు శ్రే
యమ్ముమరచు బోధ నతడు చేసె.

దీక్షనున్నవాని తేకువ పెంపంగ
నగనుగాని అడ్డుతగులరాదు
దీక్షయన్న వశ్యదేహభావమ్మును
వదలి ముందుకరుగు పట్టుదలయె.

అతని చార్వాకమునకు నేనాసపడక
పనిని సాధించి క్రమ్మర వచ్చునపుడు
తీరికల దీర్చుకొందము దారి విడుమ
టంచు కన్విప్పిచూడగా నతడులేడు.

కర్తవ్యము నెరిగిన దే
హార్తికి వగవంగదగునె! ఆర్తి నవనిజా
భర్త యొకండే బాపెడి
కర్తవ్యాచరణ తనువుకష్టము దీర్చున్.

మైనాకుని మైచింతలు
పూనిక గడతేరినంత భూతమొకండా
పూనికబిగువు సడల్పగ
న్నా నీడగ వెంటపడె గనన్ సింహికయై.

మున్నెవరేనియు దాటిరె !
అన్నన్నా కడలిదాటుటా ! నీకన్నన్
మిన్నలు భవజలధిన్ సడి
సన్నది యెరిగియును సాహసము నీకగునే !

అనుచున్ భూతము ఛాయగ
ననుమితి పరిమాణమగుచు నాకసమంతై
నను మ్రింగజూచె నే సా
ధన లైవన్ జప్పవడు గతమ్ము వగపునన్.

చేయవలసినదానినే చింతసేయ
దగును; చింతల జిక్కిన దిగులు పొగలు
దారియగపడనీక యెవ్వారిగాని
నీరసంబడ జేయు ననేకగతుల.

వర్తమానమ్మునకు సాయపడని కృతము
గతము పెనుభూతముగ నపకార మగును
ముందుకర్తవ్యమునకు నమందగతి పు
రాణములు చూపుమార్గము రాజపథము.

గతము కర్తవ్యమునకు స్వాగతముకాగ
ముందుకరిగితి సింహిక ముడిచితోక
పిల్లియై పారె మనము సంఫుల్లమయ్యె
తలచితిని యింక నేయడ్డు తగులదంచు.

కాని యన్నిటికన్న నన్గలత పెట్టె
నట్టి భూతము సురస; యీ యవనినెల్ల
మ్రింగజాలిననోట నామీది కురికె
కళలె కామ్యములని యెంచు కామరూపి.

గాన మాత్మాను సంధానమ్మునకు గాక
రాగముల్ రేపు సంరావముగను
కవితలెల్లను కామకామి యావేశ వా
గ్రూపబంధన చిత్రకూటములుగ
చిత్రలేఖన చిత్ర చిత్తచాంచల్య న
గ్నావబోధక మోహభావనముగ
నాట్యమ్మలీ జగన్నాటకాదర్శముల్
కాక కాకలుదీరు కపటములుగ

మాపె నాసురి రసభావరూపమెల్ల
సురస రససిద్ధి భవమున జూడదలచు
భవుని రుద్రుని భోగ్య సంపదల గొల్చు
భావగమ్యము తనువున బడయగోరు.

ఈయనేకముగా దోచు నేదియేని
తత్వమున నేకమన్న యథార్థసత్య
మును ధ్వనించెడిదేరసమనగజెల్లు
సత్యమును దెల్పునదియ సాహిత్యమగును.

భేదబుద్ధిని బెంచెడి వాదములకు
తావునిచ్చెడి పలుకులు తావిలేని
పూవు లచిరమ్ముననె వాడిపోవు; మోక్ష
సౌరభము నీని కృతులెల్ల నీరసములు.

ఆవేశములబెంచు నేనినాదములేని
రసదూరమైన సంభావణములు
కామమ్ములనుబెంచు కళలర్థసిద్ధికై
ధర్మహీనునిజేయు తజ్ఞులైన
లలితమ్ముగా దోచు కళలెంతవానినే
మోహతరంగాల ముంచియెత్తు
సరసుడైనను కళాసురస దంష్ట్రిక జిక్కి
నలుగుచున్ అదియ యానందమనును

ఆ సురసనోరు బ్రహ్మాండమంత, పేరు
పొంగులం దనియువారిని మ్రింగివైచు
దాని నిర్జింప నణురూపమైన శక్తి
నోట జొరబడి క్షణములో బైటపడితి.

సురస దప్పించుకొన్న వానరుడు నరుడు:
నారసింహుని గొల్చెడినరుడు సురుడు
పరము నెరిగిన సురుడు భూసురుడు వాని
నే సురస యాసురము మోసగింపలేదు.

అసురు లెవరి కంటికానని వామన
రూపినగుచు లంకలోన కాలు
పెట్టినంత నచటి యట్టహాసము, వేద
ప్రథయు కాపథమునబడుట గంటి.

ఆమె లంకిణియట ఆలంక కాపట,
రూపుజూచి కామరూపిణియని
నిశ్చయించుకొంటి; నీవెవ్వడవటంచు
నిగ్గదీసె నామె భగ్గుమనుచు.

ఆజ్ఞ లేక లంక కజ్ఞానమున నేల
వచ్చితంచు మీదపడియె దయ్య
మట్లు; నేను నామె యపసవ్యమునుబాప
సవ్యహస్తముననె చాచిగ్రుద్దు.

వైచినాడ నామె ప్రాణము కడబట్టె
పంచభూతములను మించుశక్తి
మున్ను చూడనైతి అన్నన్న ! ధాతశా
పమ్ము దీర్ప శక్తివంతుడైన

వానయందు తానెవచ్చు నీకడకని
యన్నమాట నేడు సార్థకమ్ము
నీవె సీత వెతుకనేర్తువటంచు న
శోకమునకు దారిజూపె నామె.

అంత నాతల్లి మ్రొక్కి సవ్యముగ కోట
గోడ నొకగంతునన్ దాటినాడ నేడమ
కాలు మోపితి నదియు రాక్షసుల దాకు
పథమునందున నా తొలిపదముగాగ.

పగట నిద్రించువారె, యెవ్వరును రాత్రి
ద్రిమ్మదిరుగని వారును తృప్తిపండు
వెన్నెలగ వదనసీమలు వెల్గువారు
కానుపింపరు మోహాలోకమ్మదేమొ !

వేదముల్ ఘోషించె వీరినోటంబడి
భూతమ్ములే తమ్ము బొగడినట్లు
గ్రహములున్ క్రమబద్ధగతిబాసి వీరి య
నుగ్రహమ్మునుగోరి నుతియొనర్చు.
పాకశాసనుడైన వీక వీరల శాస
నము తలందాల్చు వందనమొనర్చి
ధర్మగోపుర రమ్యభవనమ్ములన్ దప
శ్చర్యలు ధర్మచర్చలును సాగు.

రుద్రజపము శాంతిభద్రతలకు గాక
క్షుద్రవైరముల ప్రచోదనముగ
హవన గుండములను హననదీక్షల ద్రవ్వి
వ్రేల్తురచట వేదవేద్యు మరచి.

పగట మేల్కొన్నవారు నావైన మెరుగ
నింతశ్రమకోర్చి వచ్చుట వృథయె యగును
అద్దియునుగాక వీరి సమగ్ర చర్య
నిశి గనందగు; రాత్రియు నిద్రపోదు.

జాగెయగుగాక యుక్తమా సమయమెఱుగ
కుండ వైచినపథకమ్ము కుదురదంచు
వేచియుంటిని రాక్షసుల్ వేగువరకు
మింట తారలు భయముతో మినుకువరకు.

చందమామ రాక్షసేందీవరాక్షుల
ప్రియుల ప్రియముగూర్ప వెడలివచ్చె
కాముకుల యొడళ్ళు కాల్చుకుతిన్న యా
మచ్చ యెన్నటికిని మాయబోదు.

లంకాధిపుని యింటి లలనాగణమ్మునన్
గాదె జానకిని వెతుకంగవలయు
అంతఃపురాలలో నడుగిడి కనులార
గంటి జూడగరాని కొంటెతనము.

మైకమావంత నామైపీడ నాసవ
మానిరి మహావటుల్ మదనకేత
నములు గంధర్వ కిన్నర యక్షకామినుల్
తప్పత్రాగుచు గూలికుప్పలైరి

ఒంటిమీది గుడ్డలున్నప్డై లేనట్టు
లుండె నవియు కన్నులున్నవారి
చూపులకును పండెపాపమునా సిగ్గు
తోడ తనువువీడి తొలగిపోయె.

అచట వైదేహి యుండదటంచు దెలియు
కాని యంతఃపురమ్ములగాక యెచట
జానకీదేవి వెతుకంగ నౌనటంచు
వెగటు చూపుల నచటనే వెతకుచుండ.

అంతవైభవమునకు నత్యంత వైభ
వమ్ము గూర్చెడి సౌందర్యవధి గంటి
ఆమె నిద్దుర ధ్యానించునట్లుతోచె
ప్రక్క జరిగెడి దేమియు బట్టనట్లు.

అమ్మయ్య యిప్పటికి మా
యమ్మను గనుగొంటి ననుచు నత్యంతోత్సా
హమ్మున నుండగ సందే
హమ్మొదవెను "జానకమ్మ యట నట్లున్నె"!

పసిడి తొడవులు దాల్చి పట్టుపరుపు
పైన దూగెడి రాకేందువదన పతి వి
యోగమున వగదూలెడి యువిదయానె
పడతి కానోపు లంకేశు పట్టమహిషి.

సందియము బోడమినంత విస్పష్టమయ్యె
లోకధర్మమునెంచి ప్రత్యేకబుద్ధి
తైన బ్రాహ్మణి పాపపుణ్యమ్ము లెవ్వ
రాచరించిన వారివే యనెడి సాధ్వి.

ఎవరు కర్తవ్యమును విస్మరించినప్ప
టికిని యింటి యిల్లాలు వికృతి నంద
దామె తనధర్మమెరిగి అన్యమ్ము లేవి
యెట్టులైనను పట్టనియట్టులుండు.

కొంతముందేగ బంగరుకొండపైన
వ్రాలి విశ్రాంతి నున్నట్టి నీలమేఘ
మట్లు కన్పించె స్వర్ణమంచాధివాసి
దానవాగ్రణి వేదవేదాంగవేత్త.

బిచ్చమెత్తుట మాని విశ్వేశు డిట్లు
లంక నేలెడినాయన్న శంకయొదవె
అతని యాకారూపు నిద్రాణమైన బ్రహ్మ
తేజముగ దోచె ఈడెవ్వడీ జగాన ?

వక్రమగా వ్యాఖ్యలంబడి వన్నెవాయు
కావ్యమట్టులు సకలసత్కార్యములును
కామమున గంగపాలైన కరణినుండె
పాలకుడు రావణుడు భోగలాలసుండు.

తదుపరి యశోకమునగంటి ధర్మపథము
తప్పకుండిన నత డయోధ్యాపతి సమ
శౌర్య విక్రమ తేజో విశారదుండు
అతడు కర్మల నానంద మందగోరు.

ఆయంతఃపురమందున
నేయెడ బంగారుకంపె యెచటే లంకన్
బాయని కాంతా స్వర్ణ
ప్రేయారాధనయె బితుకు బితుకు బ్రతుకులే.

అంతటితో నట సీతా
కాంతాన్వేషణము వేయికనుకాగడల
ధ్వాంతరమున బెట్టెడినని
స్వాంతమ్ముననశోకవనిగ సాగినయంతన్.

ఎంతో భద్రతకై యా
ప్రాంతమ్ముల దనుజవీరభటకోటి ధరా
కాంతుని కనుసన్నలబడి
వంతులుగా రక్షసేయు వనముంగంటెన్.

అదె యశోకము కానోపునని తలంచి
లంకిణికెరంగి నే నతిశంక నామె
మాట నాసురమాయమర్మముగ నెంచి
నాడ శంకలబడ నింతె యేడనైన.

ఆమె మాటసూటి నటులనే నమ్మి నే
జొరగవచ్చి నా యశోకవనిని
ఆప్తవాక్యమైన ఆచరణానుభ
వమునగాని సాయపడమి నిజము.

ఈ యా విషయము లేము
న్నేయెరుగుదు వ్యాకరణములెల్ల జదివినన్
ఆయయ్య సేవగాక ఉ
పాయము లేకుంట తెలిసె స్వానుభవమునన్.

ఆచరణముమించు నాచారమును, స్వాను
భవముమించు విద్య యవని లేదు
ఎరుకయన్న విషయ మెరుగుటకాదు జ్ఞా
నాగ్ని తనువు వ్రేల్చుటదియ విద్య.

వల్లెవైచువారి వాక్యపద్ధతిపోలె
తర్కములను బడిన ధర్మమువలె
బక్కచిక్కి వాసివన్నెల దక్కిన
ఘనతి సీత పడెడి పాట్లగంటి.

అగ్గి పొగలబడినయట్టుల కనుమాసి
ప్రతిభవీడినట్టి పాండితివలె
చిమ్మచీకటులను చిరుదివ్వెవోలె నా
సాధ్వి యచలపుత్రి సద్దుమణగె.

విషయవాసనలట్టులు వివిధరూప
కామరూపిణు లవనిజాకాంత చుట్టు
రక్షణము పేర రాక్షసుల్ ప్రజలతామ
సమున జేయుచునుండిరి 'జ్ఞానబోధ'

కోరమూపుల కరకర కొరికి నములు
కొరకొరలవారు రాకేందు సుందరవదన
కెన్ని యెన్నెన్నొ లంకేశు కింపుగూర్చు
బోధనలచేసి రాత్మవిమూఢమతులు.

నగనట్ట్రు చీరెసారెల
నగణీతముగ బొందగలవటం చందను నె
వ్వగ గుందు లెన్నినాళ్ళని
తెగదెంపులు చేసికొనగ తెగవేధింపన్.

అగజాపతి మెడనగ ప
న్నగమను భవభయము నగజ నగుమోమునసే
నగదేల్చినట్టు లవనిజ
త్రిగుణీకృత దుఃఖజలధి దెప్పగదేలెన్.

తెలవార వనజముఖి గన
వెలిబూది నలంది వేదవేత్త నటంచున్
పులిరూపు నావు మొగమై
తొలిదేవుడు వచ్చె సాంద్రదశుహీనము వోలెన్.

పెద్దపులి దరికి నరుదేర భీతహరిణ
శాబకమువోలె కంపించె జనకతనయ
ఆతడాడిన దుర్భాష లవియ వడగ
వాడిపోయెను తనులతా వైభవమ్ము.

తనువు బంధించితినిగాన మనము నాదు
పైనబరపుమటంచు రావణుడు జనక
జాత బలవంతపెట్టెడి జ్ఞానహీన
ధార్ష్ట్యమది; మనము మరయానె తనువువోలె!

వలచితి నేనను, పడి నా
వల నెవ్వరుగాని బైటపడజాలిన వా
రిల నుండబోవరను, నీ
తలదీసెద వలచకున్న తథ్యముగ ననున్.

సాంగవేదాధ్యాయి సామదానాద్యుపా
యముల విశ్వమునేలు నంతవాడు
రాజనీతిజ్ఞు డరాతిభంజనదక్షు
డమిత తపశ్శాలి దమనశీలి.

శమదమసంపత్తి చాలని విజ్ఞాన
శోభతో చిత్తసంక్షోభి యతడు
దశదిశల్ పర్వెత్తు తలపులతో దశ
కంఠుడాయనగ రాక్షసుడుదోచు.

అణువునఃఖువున నిండినయాత్మ నిత్య
మనెడి సత్యము నెఱుగడు; తనువు మృత్యు
వాతబడకుండుటకుగా తపమ్ము సేయు
మానవత వికృతినందిన దానవుండు.

నిన్ను ముట్టగ నే నవినీతిపరుడ
గానని వచించు నదియేమి జ్ఞానమగునో
తనువు బంధించుటయెగాక మనము నాహ
రింప హింసించుటయు నొకరీతియగునో !

తప్పు జరిగిన శిక్షింపదగును; రాజ
ధర్మమదియౌట, నిదియేమొ తప్పుసేయ
దండనమొనర్పబూనుట, దాని నొక్క
రీతియనుటయు దానవనీతియేమొ !

పతివియోగబాధ బానిస తలపట
ఈతడేమొ ఉద్ధరించునంట
తనకుగానివాని తలదీయునంట యీ
తలపు లతని వెర్రితలల బుట్టు.

వలదటంచు చెప్పువారలు లేకపో
లేదు లంకనైన; వేనవాదు
లందుగలరు కాని డెందము కామాంధ
మైన రాత్రిచరుల కద్దినెలవు.

బ్రతుకుబాటలోని గతుకుల నింద్రియ
దాసుడయ్యు తన స్వతంత్రతలకు
పోంగుచుండు కొల్లవోయిన దౌర్భాగ్యు
నుద్ధరింపగల్గునో పశుపతి!

అమ్మ చెప్పిచూచినది యెల్ల బధిరశం
ఖారవమ్ముగాగ కర్కశుండు
భూతములనుబోలు పూవుబోడుల బోధ
పరుప కాపువెట్టి తరలిపోయె.

వారి పరుషమైనవాక్కులు భూపామ
తల్లి రోదనములు; తల్లడిల్లు
తరుణియెడద తూట్లుపరచిన తూపులు
శ్రుతుల జొరెడి కామరూప ఫణులు.

చిత్రహింసపెట్టి చెడిపెలు నిద్రింప
దాశరథుల కథల దన్వి దనిపి
తెలుపుకొంటి, తెలివితేటల లక్ష్యము
తెలిసికొంటి, బాట మలచుకొంటి.

ఈ రావణ దౌర్జన్యము
శ్రీరాముడు మాపినపుడె సీతకథలు, సీ
తారామ వియోగమె ప
యారాటంబైన; తీపి సాహిత్యకృతినిన్.

సీతాన్వేషణమే యో
చేతల పరమార్థమైన చేతము విరియన్
సీతారామమ్మున సం
ప్రీతింగను రామకల్పవృక్షము వశియై.

అంగుళీయక మొసగినయంత నామె
హర్ష పులకితగాత్రయై ఆశిషముల
గురిసె; రామవియోగార్తి గురిసె నశ్రు
జీవనమ్ముల భూలోకపావనముల.

అన్వేషణ దిరిగెడి సూ
ర్యాన్వయులకు సూర్యసూతి యండగ నెరిగెన్.
తన్వీమణి చూడామణి
వెన్వెంట నొసంగె వేనవేల్దీవనలన్.

డెందముప్పొంగ నేనిప్పుడే చనంగ
నేల యీనేల నేలెడి మేలికను గ
నంగదగు నతనిదా చతురంగముల గ
నంగనగునని మరల సాష్టాంగపడుచు.

సెలవ్వగైకొని, రావణుకలిమి ఆ య
శోకమని, దానవశోకవనము
జేసివేయంగ సిద్ధమై శ్రీనివాసు
మ్రొక్కినంతనె దేహమ్ము మొగ్గదొడిగె.

# పదునైదవ సర్గము

నిలువెల్ల బులకరింపగ
తలపుల దాశరథినిండి ధర్మపథమ్మున్
వెలయింప ప్రాణవాహిని
గలగల ప్రవహించు త్రిపథగామిని యయ్యెన్.

వరదగ దాకితి నా యా
సురవనమును దుడిచిపెట్టి శూన్యమొనర్పన్
ఖరకరు పాదమ్ములబడు
నిరులట్టు లశోక మంతరించెను త్రుటిలో.

వరదతాకె నసురవన మన నట మహా
వృక్షములును క్రుంతపక్షవిహగ
వితతివోలె తల్లిక్రేళ్ళతో నేలమ
ట్టమ్ములయ్యె నొక్కడమ్ములోన.

ఉపవనాంతరస్థ తపనీయ గోపుర
భవనములును నేలబడియె; రక్ష
కాళి యసురగణము నందినవారిని
యందినట్లెదాక నంతరించె.

చచ్చి మిగిలినట్టి చచ్చుకాపులువోయి
గోలపెట్ట నన్న కోతియను ద
లంపుతోడ నొంప లంకేశుడంతట
జంబుమాలి ననుప చావచితుక.

బాదినాడ నంత పలువురు మంత్రిపు
త్రులను బంప వారి త్రోవలోనె
త్రుంచినాడ నమితరోషాన తనకన్న
కొడుకు నక్షునంపె నొడయడంత.

అక్షుడరిగె నా ప్రహస్తుని త్రోవనె
చెద్దములనుబట్టి శిక్షలుండు
రావణునకు కాళరాతిరిగాగ మ
హేంద్రజిత్తు నంపె నెదిరిదాక.

కాలజీమూతసదృశుడు, కదనరంగ
కాలకాలుడు, బ్రహ్మాస్త్రఘటికు డగ్ని
తేజుడో నాత్మజుని గజవాజి సరథ
సైన్యముగ బంపె దానవజాతిగావ.

తానె వచ్చియుండుగాని భూమీశుడు
కదనరంగమునకు గదలిరాడు
అట్లుగాకవచ్చెనా శక్తిచాలమి
చాటుకొనుటయగును స్వాయముగానె.

ఆ రావణ సూనునితో
పోరాటము దెలుప నొండు పోలిక గలదే
ఔరౌరా ఆతని కీ
డేరీ! యిల నతనికాతడే సాటియగున్.

నన్నోంచ నతడు చేసిన
వన్నియు వమ్మైనయంత నాతడు యుక్తిన్
పన్నెను బ్రహ్మాస్త్రము నా
కన్ని తెలిసి బంధితుండనైతిని స్వేచ్ఛన్.

బంధితుడనైన నన్ జూచి పగలబడిన
వారలకు లేకపోయెను దూరదృష్టి
చేతికందినత్రాళ్ళ నాశిరమునుండి
పాదపర్యంతమును గట్టివైచినారు.

పగటినిద్రల భజియించువారి కేమి
తెలియు బ్రహ్మాస్త్రశక్తి! ఆ తీరు త్రాళ్ళ
గట్టినంతనె అస్త్రమ్ము పట్టుదప్పె
తానుతానైన తనువుబంధములు తెగును!

వింతజంతువుగా నన్ను వీథి వీథి
త్రిప్పి యూరేగింపుగా రెప్పలైన
విప్పకయ చూచుచుంటి నే వేడుకలను
వారి చిందులు గంతులతీరె వేరు.

ఎదిరి గెల్చినయంతనె యెగిరిపడుచు
వీగ మంచముబట్టెడి విధము లింతె
పొంగుక్రుంగులకన్న మూప్పులును రాక్ష
సములు సమదృష్టి నరసిన జగతినున్నె.

ఆ తల్లి గానకయె నే
నేతెంచిన యెడల మీకు నెల్లండెడిదో
భీతిని గ్రుంగుట లట్లే
ప్రీతిని పొంగుటయు నా సురీవిధములగున్.

పొంగు క్రుంగులు తప్ప పీ భూమి మనెడి
జీవులకు, కాని యవి తనచేతమాత్ర
మొదవె ననుకొను నహముతో పదును సెడుట
మొదలు; పిమ్మట యోగియు మునిగిపోవు.

అంతనొక వైభవోపేతమైన భవన
మునకు గొంపోయి రట పంచభూతములును
నోరు మెదపక యార్తిమై వారిసేవ
యాంత్రికమ్ముగ జేయు భయమ్ముగదుర,

ఒక్కమాటమీద నున్నట్లుగా దోచు
వార లెవ్వరికెనివారె; హృదయ
మట్టువోలె నుడుకునా యన్నరీతిని
మొగములందు పగలు: వగలసెగలు.

తగని ద్వేషవహ్ని పగబట్టు గ్రాచులే
యగ్గిబుసలు కొట్టినట్లు దోచు
ధర్మమునకునే నధర్మమ్మునకునేని
పోర సిద్ధపడెడి వీరగణము.

జేజె వెట్టుచుంద్రు భూజాని నందిని
పందియనిన నదియ వల్లెయంద్రు
తలలలెక్కగాని ధర్మముదలచెడి
తలల లెక్క వెట్టు దలపు లేదు.

కండకండగోసి కాకులకుంగద్ద
లకును వేయుమనియె రాక్షసాళి
ధర్మభీరువైన తమ్ముడొకండు వి
భీషణుండు విగతభీషణుండు.

"దూతయైనవాడు కోతియేయగుగాక
వాని వినినపిదపగాని యెదియు
చేయగూడదని వచించిన నొడలెల్ల
భగ్గుమనియును చెవియొగ్గె యన్న.

ఎన్నివిధములన్ వచించిన పదితల
లున్నవాడు వినునె! యోగ్యమైన
శిక్షయని తలంచి రక్షోగణమ్ము నా
తోక కగ్గివెట్టతూగె నంత.

తైలపృక్తమ్మొనర్చి నా వాలమునకు
నిప్పునంటింప నదెనాకు కప్పురంపు
టారతిగదోచి యానందమయ్యె నాత్మ
విధమెరింగినవారికి వెతలవేల!

రక్కసులబాధ యేపాటి! రామపత్ని
కున్నదెల్లను భర్తృవియోగబాధ
తోకవడి హర్మ్యములు పూరిపాకలట్లు
మండి రామావియోగాగ్ని మాడె మసిగ.

ఉపవనము లాంధ్యమున గూలెనో యనంగ
నేలబండెను దానవుల్ గోలపెట్ట
ఒక్క పెందూలమున వారి యుక్కడంగ
హాతులై ఆహుతులైరి ప్రాణాగ్ని కంత.

పార్శ్వములజూచి గడగడ వడకిపోతి
నింత నిర్ధూమధామము నింతిగూడ
గాల్చివేయదుగద! యీ యకార్యమందు
మాత బలియయ్యెనేమొ నా కోతిచేత.

ఆత్మనిరసనమున దుఃఖ మావహింప
క్రుంగిపోయితి, తుదకు నాకొంప గాల్చు
కొంటినా! యేల యిట్లాయె! కొంటెకోతి
చూచిరమ్మన్న కాల్చె నశోకమనరె!

అనితలంచియు నగ్గికి నగ్గినెట్ట
జాలు జ్ఞానాగ్నికాదె మా జానకమ్మ
కట్టెలంగాలునేయంచు గాంచినాడ
చూడ ముచ్చటగొల్పు నా సుదతిశోభ.

చిరునగవున నన్గనె నా
తరుణీమణి, నీవు చేయుదగినదియే; యీ
తరుణమ్మట్టిది నినాఁ
కరుణామయు డెల్లవే? గాంచుము హనుమా!

నీవిక నిస్సందేహుడ
వై వైళమ చనుము మారుతాత్మజ! విను నీ
నావారలు నీరాకకు
నై వేచుచు వేగుచుందు రాతురమతులై.

పొమ్మా పవనసుతా గై
కొమ్మా యాశీస్సు వెంటగొమ్మా సమ్మా
నమ్మున నీచూడామణి
ఇమ్మా యని నిండుకనుల నీక్షించె ననున్.

ఆచూపు విచిత్రముగా
లోచూపుగదోచె నంతలో నీజగమున్
ప్రాచీనదృష్టిగను న
ర్వాచీ నాదర్శ రాజపథము వెలార్చెన్.

మిముగలియు నెప్పుడాయను
మమకారము లాగ నిండుమనమున నీ సం
ద్రము పడియగ లంఘించితి
రమణీరమణీయ హాసరంజిత శక్తిన్.

ఆయమ్మ యనుగ్రహమున
నే యుదధిని మున్ను నిపుడు నేదాటితి రా రా
మాయనము సొగు జానకి
పొగుమ్మున వెలయు నవరసమ్ముల ధ్వనులున్.



# పదునారవ సర్గము

ఇంక కర్తవ్యమేమొ యోజింపుడీరు
రామకార్యముతోబాటు రాజునాన
తియును నెరవేరె జానకీదేవి గనిన
విదప నామతిపోయె నావిధమదేమొ !

ఏమి రావణుడోగాని యెంత తపమొ
యెంత శౌర్యమొ ! ఆతని కీడు లేడు
జగతి జానకి స్పృశియించి చావకుండ
బ్రతికినాడన్న నట్టిది వానిప్రతిభ.

పూనెనా నాశనముచేయు భువనమెల్ల
అగ్ని రక్షింపజాలెడి నంత రుద్ర
శక్తి గనజాల మీరేడు జగములందు
ఆతనిని మించు శక్తి భూజాత యొకతె !

అట్టి రావణు నిర్జించి అవనిజాత
దెచ్చు సామర్థ్యముండియు వచ్చినాడ
నామె చూడామణింగొని రాముడే స్వ
యముగ గొంపోవ దగునని ఆమె యనియె.

పారవశ్యము మీరి శరీరమెల్ల
పొంగిపొరలెడి పెద్దలు, బుద్ధిమంతు
లైన పిన్నలు కర్తవ్య మరయుడీరు
ఆచరణ తోడనే ధర్మ మవని నిలచు.

అనిన యువరాజు "కన్పడె నవనిజాత
యని వచించుటకంటె నాయమనె రామ
చంద్రు కర్పింప సుగ్రీవశపథమే శు
భాంతమై చాలు కపివీరపౌరుషమ్ము".

అంగదుని పల్కుతీరుల నాలకించి
జాంబవంతుడు "కపిరాజు జానకిని గ
నంగ బంపించె నతనియూనకు రవంత
నటునిటు నొనర్పగూడని దతనియాజ్ఞ.

తానె సీతను గొంపోవ దాశరథియు
ప్రతిన నొనరిచె; నెవ్వ డేపనిని జేయ
వలయునో యాతడే చేయవలయుదాని"
వనిన సుష్టని వచియించె నంగదుడును.

అంత చిందులు గంతులు నాడుకొనుచు
పాడుకొనుచును సాగిరార్భాటముగను
తానె సీతనుగన్నంత తమక మెసగ
కూడి తమతోకపాడవుల గొల్చుకొనిరి.

మఱులు పయనించె నాకాశమార్గమందు
గతుకు బ్రతుకుల నేల నంగలకు నూత
గాని యమాంతము జేజేలు కొట్టు[illegible]
ఎగిరి కిష్కింధలోననే దిగిరి కపులు.

ఆ పయనం బారీతిని
తాపసులే యెరుగజాలు దారిని సాగెన్
చేపిన గోమాతల గని
ఆపగిదిని తరణకమ్ము లరిగినరీతిన్.

ఊరి బయటకు జేరిన వారి కడుపు
తెలిపె నలసట, ఎన్నాళ్లో తీర్థసేవ
చేసి యిలుసేర నలపు దోచెనో యనంగ
మధువనము జేర నందరు మనసుపడిరి.

బ్రహ్మవిరచితమగు మధువనము సకల
భోగ్య నిలయము; రాగవైరాగ్యసదన
మదియ భవబంధముల వాలుమార్గమయ్యె
ముక్తిమార్గమ్మునకుగూడ మొదలు తుదియు.

సత్యాసత్య వివేచన
సత్యాన్వేషణయె జన్మసాఫల్యము, యీ
మత్యనుభూతికినై అను
నిత్యము పోరాట మొకడె నిజమగు బ్రతుకో!

ఏ పథమైనను సుపథమె
నాపథమునది బ్రతుకులన్ త్రికరణవిశుద్ధిన్
వైకి వహించుట; ఆ
ఏకమె పాపములకు దారులు తీయున్.

అంగదుని జేరి కపులు "మా కందరకును
చావుతప్పదు; సీతమ్మ జాడ దెలిసె
గాని యేనాడొ దాటెను గడువు; కీశ
పతియు తనమేరదప్పిన బ్రతుకనీడు.

ఒక చుక్కౌ నైచుకుని చా
వుకు సిద్ధంబయ్యెదము ప్రభూ! మధువనమే
సకలము మరపించెడి మా
కిక రెండేరెండు త్రోవ లిదియో అదియో!

అంగదుడు యోజనము జేసి హనుమవద్ద
కరిగె నాతండు జాంబవదాది ముఖ్యు
లేమి చెప్పెదరో విని 'యేమిపోయె
చుక్క మతిపోవు టెత్తరి శుభమె' యనియె.

ఇంద్రసుతుడైన వాలియు నినసుతుండు
నెన్నడే కాలుపెట్ట రదేమొగాని
దధిముఖుడు నతని సేవకతతియు గాచు
మధువనము జూడ వెరతురు మానవాళి.

వెతుక నరిగిన కపులెల్ల విజయగర్వ
హుంకృతులతోడ నమితసాహంకృతిగ వ
నమ్ము ప్రాకారముల లంఘనమున దాటి
తోకలెగయగ ద్రాగిరి పీకలంట.

వనము జెరచుటె లక్ష్యమో యనగ గపులు
కోతికొమ్మచ్చులాడుచు గొమ్మలెల్ల
విరచి ప్రోగులువెట్టిరి, బిక్కచచ్చు
సేవకుల పారద్రోలిరి చితుకగొట్టి.

కోరికినవి కొరుకకుండగ
వరఫలముల నెమకి యిచ్చువచ్చినరీతిన్
ఊరుకులు పరుగులు పెట్టిరి
తరతమ భేదములు తప్పుత్రాగిన నున్నే !

"నేనేగద జానకి గ
న్నా"నని యొకడనగ 'అట్లనా ! జనకుడవీ
వే, నేనెరుగుదు' ననె; నొక
'డా' సీతనితనయ జానకమ్మయొకాదే".

కుండమధువాని నేలపై గొట్టె నొకడు
కుండ బోర్లించి పైన పూదండ నునిచి
మ్రొక్కె సాష్టాంగముగ మధుమూఢభక్తు
డొకడు శివతాండము చేసి యొరిగె నేల.

సేవకులు పర్విన్నంత నిక్షేపమైన
భావముల నొకరినొకరు దుర్భావలాడి
రొకడు 'మీయబ్బ యెవడనె' నొకడు 'తల్లి
నడిగి చెప్పుమ' యని పరిహాసమాడె.

ఆడెడివారలు వరుసల
నాడెడివారలును, భరతపద్ధతి నాట్యం
బాడెడివారలు, నేడ్చుచు
నీడల తలద్రొక్క పర్వునించెడివారల్.

"ఏరా మనమేగదరా
పారావారమ్ముదాటి పసిగట్టితి మా
క్రూరున్; రావణు జంపుట
కేరా మనమేలచాల మింతల మయ్యున్"

"నేనొక కావ్యము వ్రాసెద
నౌనని తలలూపవలయు నందరు కపినై
నేనున్ గవికానా! మరి
ఆ నాడెల్లరి? మనుజులందరు కవులే"

"ఇల గుండ్రముగా నున్నదె!
తలతోకయు లేనివారితల నే పురుగో
తొలచిన మాత్రమ్మున నీ
యిల గుండ్రంబానె వెర్రియే శాస్త్రములున్.

"రామున కొకతోకయు లే
దేమిర! అతడెంతఘనుడో యేనెరుగనొకో
కామించి యొవతెనేనియు
ప్రేమింపగరాదె! తోకయేదీ తెలియన్"

కుండయెదుటనె జపమున గూర్చుచుండె
నొకడు "చూడుడు ఈ కుండలో నున్నదేమొ
మధువు; చూడుడు ఈ మంత్రమహిమ వలన
కుండ పొంగును మునుగు బ్రహ్మాండమెల్ల".

"దేహమ్ము మట్టికుండయె
దాహము దీర్పంగజాలు దైవమదియెగా
మోహమ్మున దెలియరహా
సోహమ్మన కుండనేను నొక్కటియగుటే"

"అధ్యాత్మము నెరుగగ వే
దాధ్యయనమ్ముల దారిదప్పక జ్ఞానో
పాధ్యాయుడనగు నా కడ
నధ్యయనము సేయుడంద రజ్ఞతబాయన్."

"మీరందరిచట నుండుడి
ఆరామున కేను వినుతు నజ్ఞానము గా
దా రామా! భార్యకునై
పోరాటము హింస అల్పబుద్ధులకె తగున్"

"నా తనయ నిచ్చి చెప్పెద
ప్రీతిగ నీకిష్టమైన విధమున వందున్
యాతనగాక స్వహ స్త
మ్మా! తగునా యిద్ది యొక మహారాజునకున్.

"తండ్రి మాట నిలుప తగుదునమ్మాయని
ఈతడేల నడవి కేగవలయు;
నోరులేని రాముడారీతి, సీత స
రేసరి మతి యింతలేనిదిగద !"

ఒక్కడొక్కొకరీతిగా నొడలు మరచి
తాను చెప్పినయట్లుగా ధరణియెల్ల
రాచరించిన బాగుండుననియె నొక్క-
డిప్పుడై గ్రుద్ది చెప్పిరి ప్రేమమీద.

కైపు దిగిపోయి చావు కన్నూపు మేర
లోన గన్పడగా పరిదీనపదను
లగుచు దిగజారిపోయి యీ యవని చావు
మరువజాలిన కైపునిమ్మా యటంచు.

మ్రొక్కులిడసాగిరెంక నేదిక్కులేక
మాయ యీ సుఖదుఃఖముల్ మరువదగిన
యంత దట్టముగానైన యలముకొనదు
దైవమును గ్రూరుడే జీవిగావరాడు.

సేవకులు పోయి వనమెల్ల చెడినవిధము
తెలుప దధిముఖుడే తెంచి సలిపె పోరు
తలకు నొక్కొక్క తన్నుగా తరిమి తరిమి
కొట్టి రాతని తిట్టని తిట్టులేదు,

హనుమ దంగద జాంబవదాదులెల్ల
చూచుచునె యూరకుండుట జూచి దధిము
ఖుండు చల్లగజారె ప్రభుండు తలప
దెబ్బలకు కొదువయుండని తీరులెంచి.

అతడు సుగ్రీవు కడకేగి వెతలగోడు
గొల్లుమని యేడ్చి తెలుప సంఫుల్లవదను
డయ్యె నినసూతి దధిముఖు డచ్చెరువున
"ఇతనికింగూడ మతిపోయె నేమిసేతు."

అనుచు చతికిల పడిపోయె, నినసుతుండు
ఫుల్లవదనారవిందుడై "చల్లనైన
వార్త దెచ్చిరిపో మధువనమదెంత
ప్లవగ సర్వస్వడగుగాదె పవనసూతి.

పోయి నామాటగా చెప్పవోయి, నేనె
వారి రమ్మంటినని శుభస్వాగతమ్ము
అమ్మజూచియె వచ్చి నాయానదలచి
మరణశిక్ష తప్పదని [illegible] మరచినారు.

దధిముఖా నీదు జన్మము ధన్యమయ్యె
అంతయానందమును కన్నులారగన్న
నీదు కన్నులెకకన్నులు, నీదు చెవులె
చెవులు నీకిక భువి నెట్టిసేగి లేదు''.

దధిముఖునకపుడు తాదిన్న తన్నులెల్ల
దన్నుగాదోచి పోయి సోదరులనట్లు
అందరిన్ కౌగిలించి "మహానుభావు
లార దయసేయుడని కీశరాజు నాన"

అని వచింపగ మారుతియనియె ''మిత్రు
లార ! సుగ్రీవుడాతడు, జీరవోని
పాటగా జీవనము నాటపాటకాగ
గడుపు కపిరాజు వేసెల్గు కన్న కొడుకు.

చావు భయమిాగి యింక నిస్సంశయముగ
రామచంద్రపదాబ్జ సౌలభములాన
కదలుడీ వాసనలపట్టు వదలిపోయె
సీత నెరిగిననే మృత్యోక్షితి తొలగు.

వానరవరునకు జయమే
ఆ పవనసుజయము భవహనుమంతుకు జయమే
గానము ధ్యానము జ్ఞానము
ప్రాణము సార్థకము రామపద సంస్మరణాన్.

ఆనందమె దామముగ నా
వానరులందరును జాంబవద్ధనుమ జయ
ధ్వాన మ్మంగదు నామో
దానన్ గపిరాజు జేరి దండములిడగన్.

సీతమ్మ గనిన కన్నుల
ప్రీతిన్ గనుగలిపి పలుకరించెను; సుగ్రీ
వాతిశయప్రేమల తన
చేతమ్ముప్పొంగ హనుమ చేసెను ప్రణతుల్.

"చూచితి సీతమ్మ" ననన్
వాచినకన్నులను విప్పి "వాతాత్మజ ! నీ
చూచినకన్నులగని విర
బూచెనయా తనువు; పూర్వపుణ్యము పండెన్!

వివరముగ దెలుపుమోయీ
పవనసుతా ! నీవు ధైర్యవంతుడ వబ్ధిన్
రవంత లేకయె దాటితి
జవసత్త్వ పూన్కి నీదుసము లేరిభువిన్"

అనుచుండగ చూడామణి
వినయమ్మున నధిపునకు నివేదింపగ బో
యె నతండాతని చేతుల
దినకులమణి కొసగ కన్ను లేడ్పున మునిగెన్.

దాని జేతులగొని పరిదీనుడైన
తరణికులమణి గుండెలు తరిగిపోసె
ముజ్జగమ్ముల నేకైక సజ్జనుండు
భోరుమని యేడ్వ గంగ మున్నీరులయ్యె.

"తనశిరోభూషలో దనతలపు వలపు
నిలిపి పంపినదా పావనీ! అదృష్ట
వంతుడవు నాకుగూడ కన్పడని సీత,
నినుడగానని దేవి నీకనుల గంటి.

ఏమియిచ్చిన నీకు నా ఋణముతీరు"
ననిన పావని పాదములంటి "నీదు
కంటబడి గండశిలలైన కరగి ముజ్జ
గమ్ములన్ బ్రతుకులన్ పానకమ్ము జేయు.

మేమేడ్వ దగునో యేమో
రామా! నీ యేడ్పుతో ధరాతల మెల్లన్
క్షామమ్ము వాతబడు మా
క్షేమమ్మనకైన నాలకింపుము స్వామీ!

నీయేడ్పుజూచి సూర్యుం
డే యీభువనముల కాల్పడేమయ్యా! కం
దోయి యొనర్చిన పాపం
బీయెద బ్రయత్నులునుగాదె యీాక్షించి నినున్.

ప్రేలిన నీ గుండెలలో
ప్రేలిన యణుశక్తి యింతలింతలునై లో
కాలం గిరగిర ద్రిప్పెడి
కాలునకే యిపుడు కానికాలమువచ్చెన్.

మాయమ్మ ఆర్యపుత్రుని
కీ యాభరణమ్ము నొసగి యిక నెన్నాళ్లో
కాయమ్ము మోయ లేదని
శ్రీయుతులకు దెలుపుమంచు జెప్పెను స్వామీ!

అయ్యా! చూచిన నాకే
వ్రయ్యలెడద తానమోఘబాణుండైనా
కుయ్యాలింపడు దయరా
దయ్యోనె! కనుగొమ్మటంచు నాయమ పలికెన్.

మీదుఃఖము వర్ణింపగ
"నా దుఃఖమె యింతజేసె నలుగాకున్నన్
ఈధరణీ సంభావ్యం
బై ధరణిజజాడ తెలియడా'యని వగచెన్.

"నాయుసురు శోకముందే
ఈ యసురుని భాధతీర్ప నేగతినెప్పుడే
నాయయ్య రాకపోడని
మోయుదు దేహమ్ము తెల్పుమోయీ" యనియెన్.

ఆ రావణలంకన్ వే
దారావము లింటనింట "అగ్నయ ఇతిస్వా
హారావములే మరి యా
దారియె వాపు మ్మశాంతి తాండవమాడున్.

"లేడిని గోరగ నాకొక
గాడిద సంప్రాప్తమయ్యె గాడిని నేనే
వీడితి నినకులమణి యా
వేడింబడి యిట్లు నన్నువీడెనొ యనియెన్.

క్షణమొక్క యుగముగా నే
క్షణమున కాక్షణమె రాకకై తప్తవియో
గిని కనులుగాయ జూచెడి
ఇనవంశపయోధిసోము నీయాపేక్షన్.

రావణముగులంకన్ ని
ర్జీవిగ జీవించు రాక్షసీపరివృతనై
భావుకహృదయా! నీ పద
సేవామృతసేచనమ్మె జీవము హోయున్.

ఏమని వచియింతునయా
స్వామీ వివరింపనగునె! స్వానుభవమ్ముల్
నామట్టుకేను వెరచెద
నా మాతం దెలుప సాధ్యమా పలుకులకున్.

కనిరమ్మని పంపగ నే
కనులారన్ సీతగన్న కడపట సర్వ
మ్మును లంకగుట్టు దెలిసితి
వనితా ధనకనక వస్తు వాహన వికృతిన్.

అచటి స్వాధ్యాయ మచ్చటి యగ్నిహోత్ర
మచటి గుడిగోపురమ్ములు, నచటి కొలువు
లచటి జుట్టును కట్టు నత్యంత మాన
వముగ దోచెడి అసురబంధనములు.

చేతలందు రవంతయు చిత్తశుద్ధి
దోప దేవేళ నెయ్యదో కైపు తలకె
నెక్కినట్టుల వారు చరించుచుంద్రు
శాంతియన వారికోశాన చచ్చుదనము.

ఇంతకున్ వనట గుందెడి యింతి నిల్లు
చేర్చదగునవి 'అమ్మ ! నిశ్చింత నన్ను
వాహనము చేసికొని రామభద్రుచెంత
జేనుమా ! యన నామె కన్నీరునింపి.

"హనుమ ! మతిలోన మతియున్నయపుడు పర పు
రుషుని బుపినైన ముట్ట, నా క్రూరుడట్లు
నన్ను వివశను గొని తెచ్చె నాథుడిటకు
వచ్చి నా చెర విడిపింపవలయు నంతె,

సంద్రమును చెఱువుగా దాటజాలు ప్రభువు
గుండె చెఱువౌట రాజాలకుండె నీ ని
వేదనము విన్నయంత నావేదనముల
బాపునని సీతయాత్మవిశ్వాస' మనఃము.

అనిన మాతకు నేమందు ! 'అల్లై తల్లి
యెఱుక నిమ్మంటి నా గుండె కరగిపార
ఆత్మచరితము జెప్పె కాకాసురుండు
నాడు సల్పిన ఘోరము నాథుడెఱుగు.

తిలకము దిద్దితివట మణి
శిల నఱుగగ దీసి నాడు సీతారామా !
శిలలన్ సైతము వనితా
తిలకము లోనరించు వంశతిలకుడవు గదా !

ఆర్యపుత్రుడు నేను నేకాంతమందు
నున్నతరి జరిగెనని తెల్పె నెన్నియుగము
లాయెనో మారుతీ ! సగమాయ నేమొ
బోనమిడు టెన్నడో ! పరిదీనురాలు".

అనుచు కడుపునిండ నారగించుటగాని
కంటినిండ నిద్రగాంచి గాని
ఎన్నినాళ్ళనుండో యెఱుగనితల్లి చూ
డా మణి నొసంగి" రామభద్రు

పదములందు వ్రాలుభాగ్యము నాకన్న
ముంటె దీనికొదవు ! మందభాగ్య
నైన నాకు నెన్నడార్య పుత్రుని పాద
సేవయబ్బు' ననుచు సీత కుమిలె.

చూచు నాకె యింత క్షోభకల్గిన పడు
పాట్లు పడతి కెంత బాధ యగునొ
అనుభవమ్ము లెంత ఆత్మీయులకునైన
పంచుకొన దగినవా మహాత్మ !

ఏమి చేయదగునొ యినసూతి, యినకుల
మణియు దెల్పదగినమాట; మీరు
చెప్పినట్లు పనుల జేసితి నటునిటు
గా" యటంచు హనుమ డోయిలించె.

అందాలబరిణె సీతా
సుందరి ప్రత్యక్షముగనె జూచినకతిన్
అందరు నీక్షించుట చి
త్సుందరమై కావ్యజగము సుందరమయ్యెన్.

